శ్రీ

ఈశ్వరకృష్ణగ్రంథమాల : ప్రథమకుసుమము.

# నందనారు చరితము.

Y V Sree Rama Murty.

(II year class Hindu College)



కృష్ణకౌండిన్యుడు

1938

 [వెల రు. 0-12-0

# విషయ సూచిక.


| | | పుట. |
|---|---|---|
| 1. | విన్నపము | i |
| 2. | పరిచయవాక్యము | ii |
| 3. | పీఠిక | ix |
| 4. | అంకితము | xxi |
| 5. | స్మృతి | xxi |
| 6. | కథాసంగ్రహము | xxii |
| 7. | పాత్రవర్గము | xxiii |
| 8. | నాటకము | 1 |
| 9. | లఘుటీక | 93 |

# విన్నపము

ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు ఈనాటకమును ఇంటర్మీడియెటు పరీక్షకుఁ బాఠ్యముగా నియమించుటచే నీపునర్ముద్రణమును జేసితిని. తత్పరిషదాంధ్రపాఠ్యగ్రంథనిర్ణయసభవారి కెంతయు కృతజ్ఞుఁడను.

విద్యార్థులకొఱ కీగ్రంథమునఁ బీఠికయు లఘుటీకయుఁ జేర్చితిని.

మొదటిముద్రణమునకు సాహాయ్య మొనరించి యందుఁ బరిచయ వాక్యమును వ్రాసి నన్నాదరించిన శ్రీ శ్రీ శ్రీ విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు కీర్తిశేషు లైరి. ఇట్లు మాత్రమే వారి స్మరణ యుపలబ్ధ మగుట నాదురదృష్టము.

నేను కోరినమాత్రాన పండితవరేణ్యులు నాకు గురుతుల్యులు బ్రహ్మశ్రీ వఝుల చిన సీతారామస్వామిశాస్త్రిపాదులవారు సంస్కృత నాటకలక్షణము లిందెంతవఱకు ననుసరింపఁబడినవో పరిశీలించి తమ యభిప్రాయమును వ్రాసి పంపఁగా వేఱుచోటఁ బొందుపఱిచితిని. వారికి నమస్కారశతంబులు.

నెల్లూరు,
1—7—33.

గ్రంథకర్త.

# పరిచయవాక్యము

---

హిందూమతపరిణామమునందు భక్తియోగము పూర్ణయోగఘట్టము. కర్మయోగము జ్ఞానయోగము భక్తియోగమునందు సమన్వయము పొందుచున్నవి. వేదాంతము భక్తియోగమునందు సార్థక మగుచున్నది. భక్త బృందావనమునందు మమకారాహంకారపరములైన మతకులజాతివిశాభేదము లంతరించి మానవప్రేమపరమైన భగవత్కైంకర్యము సాధ్యమగుచున్నది. దురారాధ్యమైన కర్మమార్గము శిథిలమై సుఖారాధ్యమైన భక్తిమార్గము హిందూమతమునందు ప్రబలినవిధమును హిందూమతేతిహాసములు వేనోళ్లను చాటుచున్నవి. అంత్యజులు అగ్రజులకు జ్ఞానోపదేశమును జేసి కృతార్థులను జేసిన విధమును ధర్మవ్యాధోపాఖ్యానాద్యుపాఖ్యానములు బోధించుచున్నవి. ఆత్మగతమైన భక్తియోగము బాహ్యలక్ష్యములైన వర్ణాశ్రమాదులను జయించినవిధమును భక్తులజీవితచరిత్రములు తెలుపుచున్నవి. శివసాన్నిధ్యమందు మానవకల్పితములైన అగ్రజాత్యంత్యజభేదములు లే వనెడి వేదాంతోపదేశమును భక్తిమార్గము నిత్యజీవనమునందు సార్థకము చేయుచున్నది. భక్తుల దివ్యచరిత్రలందు మాలభక్తుఁడైన నందనారుచరిత్రము పరంజ్యోతివలె ప్రకాశించుచు నన్ని వర్ణములవారికిని జ్ఞానోపదేశము చేయుచున్నది. పవిత్రమైన నందనారు చరిత్రమును శ్రీయుత ఓరుగంటి కృష్ణకౌండిన్యుఁడుగారు నాటకరూపమున, వర్తమానకాలరూపముల కనురూపముగ, రచియించి సనాతన సంస్కర్తల కృతజ్ఞతకు పాత్రులైరి.

నందనారుచరిత్రాంశము సామాన్యులకును తెలిసిన విషయము. నందనారు మాలపాలేరు. నటరాజభట్టరు బ్రాహ్మణయజమాని. నంద

నారుభక్తిప్రభావము నటరాజభట్టరుని మాలవానికి భక్తుని జేసినది. ఈ నాటకమునందు గ్రంథకర్త, హరిజనోద్ధరణము గాంధిమహాత్ముని యా దేశోపదేశములు దిగంతవిశ్రాంతములయి నిండియున్న సమయమందు, అవలంబించిన రచనావిధానము రసభావప్రకటనమునకు శ్లాఘ్యముగ నున్నది. నాటకమునకు నందనారుచరిత మని నామకరణము చేసినను విశ్వనాథభట్టరును ప్రధానపాత్రముగఁ గైకొనుట భావౌచిత్యమునకుఁ దగియున్నది. విశ్వనాథభట్టరు నటరాజభట్టరునికుమారుఁడు. నాటకము విశ్వనాథభట్టరుపాత్రముతో నారంభాంతముల నొందుచున్నది.

విశ్వనాథభట్టరు అగ్రజుఁడు, నందనారునకు స్వామి. నందనారు మాలయును పాలేరును. మాలపాలేరైన నందనారునకు విశ్వనాథభట్టరు శిష్యుఁడును, భక్తుఁడును, సహచరుఁడునునై భక్తిప్రభావమును పండితపామరులకు సుగమము చేసినవిధమును నాటకము గంభీరముగను సరళముగను ప్రదర్శించుచున్నది. విశ్వనాథభట్టరు బ్రాహ్మణవంశజుఁడు, మహాపండితుఁడు, యువకుఁడు, ధర్మపరాయణుఁడు; అయినను కులమును, సుఖమును, సంసారమును విడిచి ధర్మారాధనపరాయణుఁడై కృతార్థుఁ డయ్యెను. సనాతనమైన హిందూమతప్రవాహము నవజీవనమును వికసింపఁజేయఁగలవిధమునకు విశ్వనాథభట్టరుచరిత్రము ప్రమాణము. హిందూమతమును కృశింపఁజేయుచున్న అంటరానితనము, దేవాలయప్రవేశనిరోధము మొదలగుదురాచారములు పోవుటకు బ్రాహ్మణులు మార్గదర్శకులు గాఁగలవిధమును నాటకము బోధించుచున్నది. విశ్వనాథుఁడు శిరమున నంజలి ఘటియించి నందునకు సాష్టాంగప్రణామము చేయుచు వెల్లడిచేసిన భావములును, అప్పయదీక్షితునకుఁ దెలిపిన భావములును హృద్యముగ నున్నవి.

అంతరంగనిష్ఠ మాత్మోరుభాసమ్ము
చక్షువులకుఁ దెలిసె; శాంతమహము

నిత్యశుద్ధమైన నిర్మలతేజమ్ము
మోహనాశకమ్ము మ్రొక్కువాఁడ.

మాలయ, నైన నేమి ? యనుమానము లేదు; శుభుండు; బ్రహ్మసూ
త్రాలు పఠించునర్థము ముదమ్ముగ మూర్తి ధరించె నిట్టు లా
బాలసుధాంశుశేఖరునిబంధురతేజముగాని వేఱె ? పా
పాల దహించువారయిన భక్తి భజింపుఁడు వీనిపాదముల్.

నందనారు తనతండ్రివలనపడినకష్టములకు విశ్వనాథభట్టరు పొందినసంతాపము అగ్రజులకు ధర్మనిర్వహణమార్గమును బోధించుచున్నది.

ఈయఘ మెట్లు పాయునొకో !
యిమ్మహితాత్ముఁడె యింటిబంటి; దే
వో యిటు వేషధారి యయి
మోహము గొల్పఁగఁ జంద్రమౌళికిన్ ;
ఆయతిమూఢభావముల
నర్మిలితోన హరించు నేర్పొకో !
ఈయనఘాత్ము పాదయుగ
మిచ్చుత మాకు మహోదయమ్ములన్.

నందస్వామి నటరాజస్వామితో నైక్యమును పొందినపుడు విశ్వనాథభట్టరునకు కలిగిన విషాదానందములు హిందూమతసంప్రదాయములందలి యథార్థమైన భక్తి పరమార్థమును బోధించుచున్నవి.

జననం బొందిన మాలవై పుడమి నాజన్మంబు శుద్ధుండవే;
యనలం బొందఁగ నయ్యె నీకు నిటు; లీయార్తుల్
విషాదమ్ములున్
మన సెట్లోర్చును ? నీదురంతవిధి నే మందుండునుంబోలె నై
తిని ; నీయానతిఁ దీర్పఁగావలయు నీదీనున్ గటాక్షింపుమా.

నాటకమునకు హృదయమైన నందనారుశీలము చక్కఁగ ప్రదర్శింపఁబడినది. నిష్కామకర్మయోగమునకు నందునిప్రవర్తనము ప్రమాణము. ద్వంద్వమోహవినిర్ముక్తుఁడైన నందనారునకు నటరాజభట్టరు పెట్టెడిబాధ లగోచరములై నటరాజస్వామిమాత్రమె సర్వత్ర గోచరమగుచుండెను. భగవంతుఁడు తనభక్తులహృదయములందు నివసించి యుండెడివిధమును నందనారుమాహాత్మ్యములు విశదము చేయుచున్నవి. ప్రేమసాధ్యమైన భక్తిమార్గమును నందనారుచరిత్రమునందలి పిట్టలు చేనుమేసినవృత్తాంతము సువ్యక్తము చేయుచున్నది.

రయమునఁ బోయి, నాచెలువురమ్యకళాయుతదేహశోభ నె
ల్ల యనుభవించి, మ్రొక్కు లిడి, లాలనభాగ్యము పొంద
నేర్తు రే;
నయమున లేదు, శోకమున నాకొనఁగూడదు, మెంచు పెట్టుల
య్యయగజనాథుఁ జూచి నయనార్తిఁ దొలంచు సుఖంపు
మార్గముల్.

నటరాజభట్టరు పశ్చాత్తాపమును బొంది నందనారునకు శిష్యుఁడై నపుడు ఆయనకు చేసినయుపదేశము సకలజనులకును మాననీయము.

సకల మిలను శివుని చరరూపవిభవమ్ము ;
భేదభావ మెంచ బిరుదు గాదు ;

ప్రేమగల్గుచేతఁ బ్రియవాక్యములచేత
గారవించు టొప్పుఁ గలుషునైన.

ఉన్నదానఁ దృప్తి నొందినవిజ్ఞుఁడు
పొందు సుఖము, పొందు పుణ్యచయము.
భక్తిలేనివాని భగవానుఁడైనను?
జ్ఞాన మిచ్చి ప్రోచు కరణి గలదె

నందనారు మమకారాహంకారములను విడిచి భ
మును చేరిన యద్భుతదృశ్యము సనాతనులకును, సంస్క
మైన భక్తిప్రభావమును పరిస్ఫుటము చేయుచున్నది.

"ఇహామున్ ద్రోచి పరంబు గోల్తుమఁట ; యిం
కే" యంచు గర్వమ్ముఁ
ను హతాశుల్ గనలేరు నాథు నదియున్
దోషప్రకారంబె క
'అహ'మ్మున్ భావము ద్రోచుటే సుఖము; '
యన్ దృష్టియే మూల
యిహపర్యాప్తికిఁ; గాన నా'యహమిక'
న్నీశున్ సమర్పింపుచ

ఆచారపాశబద్ధమును, జడప్రాయమును, దురారాధ్య
హిందూమతసంఘమునందు ధర్మోద్ధరణావసరమును నం
చరిత్రసంకీర్తనము విశదము చేయుచున్నది. ఈ పవిత్రచరి
జుల కాత్మవిశ్వాసమునకును, అగ్రజుల కభిమాననిరూ
సాధనభూతముగ నున్నది. నాటకమునందువలెనే అ
త్తాపము నొంది హరిజనోద్ధరణమును స్వధర్మనిర్వాహణమును

మార్గము. ఈపరమార్థమును గ్రంథకర్త నాటకమునందు గంభీరముగను నిగూఢముగను సనాతనులకును, సంస్కర్తలకును ప్రదర్శించి సనాతనధర్మమార్గమును సువ్యక్తము చేసెను. వర్తమానకాలమునందు హిందూసంఘమును కలవరపఱచుచున్న హరిజనసమస్యను నాటకరూపమున మనోహరముగ కల్పించిన శ్రీయుత కృష్ణకౌండిన్యుఁడుగారు ధన్యులు.

శైలి భావముల కనురూపముగను, సరళముగను, మధురముగను నున్నది. సామాన్యపాత్రలు వాడుకభాషను వాడుట సమంజసము. పద్యములందు సంస్కృతభాషాప్రాబల్యము గోచరం బగుచున్నది. ప్రజాసామాన్యమున కుపయుక్తమైన గ్రంథమునందు తెలుఁగుభాష నధికతరముగ వాడుట ఉచితము. భావప్రకటనమునందును, వర్ణనలందును రసవంతములైన క్రొత్తకల్పనలు కలవు. పై నుదాహృతములైన పద్యములవలెనే ఈక్రిందిపద్యములును శైలికిని నూతనకల్పనలకును నిదర్శనములు.

యోగమునయందుఁ ద్రిగుణము లొనరు కరణి
నభ్రవీథిఁ దమశ్ఛవు లలరె; నంత
రజని యూడ్చిన కరుడైన రజము నాఁగ
శశి వెలింగెను; వెన్నెల సత్త్వ మొనరె.
అభ్రగంగాలహరి నోలలాడు విధువు
పరమశివునిమౌళి ననార్తవంపుఁబువ్వు;
అతని కరచర్చఁ గరఁగుచు నలరు చుక్క
లైందవామలమణిభూష లంబసిగను.

పాదమ్మంతధరిత్రిగర్వితుల సేవన్, వర్ణవిభ్రాంతులన్
వాదవ్యగ్రతఁ గాక ప్రేమసుధసంప్లావంబునన్, దేర్చఁగా

. . .

నీదీనుల్ తరియింపఁ,దోఁచెనో కటా యీయంత్యావర్ణ మ్మునం
దా దేవుండు జనాఘరక్షకుఁడు దా నైశ్వర్యహీనంబుగాన్.

కృతికర్త శ్రీయుత కృష్ణకౌండిన్యుఁడుగారును, కృతిపోషకులు రేబాల సోదరులును యువకులు, నవజీవనప్రేమోపాసకులు. భగవంతుఁడు వీరి కభీష్టసిద్ధిని నిట్టి కావ్యరచనాపోషణభాగ్యమును నింకను నధికతరముగను గలుగఁజేయుఁగాత. ఆంధ్రలోక మీకృతియందలిగుణముల గ్రహించి దీనికి స్వాగతమును, గ్రంథకర్తకు ప్రోత్సాహమును నొసంగి హిందూమతధర్మరహస్యమును గ్రహించుట సమంజసము.

గ్రంథకర్త నాకీపరిచయవాక్యములను వ్రాయుట కవకాశమును గల్పించి గౌరవించినందులకు కృతజ్ఞుఁడను.

శ్రీముఖ సంవత్సర
జ్యేష్ఠ బ ౧౩ బుధవారము.

కా. నాగేశ్వరరావు.

# పీఠిక.

## ఆకరములు

భక్తిమార్గమున నీశ్వరుని సేవించి కృతార్థులైన ధన్యులలో నాది ద్రావిడభక్తుఁడైన నందనారొకఁడు. అతనిచరిత్రము తెనుఁగున చిలకమర్తి లక్ష్మీనృసింహముగారిచే సంగ్రహముగ వచనమున రచితము. సంబంధము మొదలియారి తమిళ 'నందనారు' నాటకము యొక్క యాంధ్రానువాదమునను ఈతనికథ యుపలబ్ధము. ఇటీవల నొక రిరువురు హరిజనోద్ధరణకోలాహలప్రధానముగఁ దెనుఁగునాటకములుగ నీకథను దీర్చియున్నారు.

తమిళమునను సంస్కృతమునను ఈకథ కేయాకరము లున్నవో శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు భారతి శ్రీముఖ మార్గశీర్ష సంచిక యందుఁ దెల్పియున్నారు. తద్వివరణ మొక్కింత.

1. క్రీ. శ. ౯-వ శతాబ్దిని సుందరస్వామి తన 'తేవారము'న 'తిరుత్తొండత్తొహై' అను భాగమున "తిరునాళైపోవారు"ను లింగైక్యము చెందిన భక్తుల నొక్కని గా స్మరించియున్నాఁడు. 'తిరునాళైపోవారు' అన నందనారే యని ఎల్ల రంగీకరించిన విషయము.

2. క్రీ. శ. ౧౦-వ శతాబ్దిని నంబియాండార్‌నంబి తన 'తిరుత్తొండర్ తిరువందాది'లో 'నాళైపోవారు' మాలయనియు, అయినను చిదంబరముదీక్షితు లతనికి నమస్కరించిరనియు నుడివెను.

3. ౧౧-వ శతాబ్దియందు శేక్కిడర్ పెఱియపురాణమును వ్రాసెను. దాన నందనారుచరితము (నాళైపోవార్ నామపూర్వకముగ) లబ్ధము.

నందనా రాదనూరుగ్రామవాసి. శివకైంకర్యము సేయుట కొఱఁకు వాద్యములకయి దేవాలయపుమంగళ్ళకుఁ దోళ్లు బాగొనరించి యిచ్చువాఁడు. సమీపమునఁ 'దిరుప్పంగూరు' శివుని జూచుట కెంతయు నందుఁడు ప్రయత్నించి విఫలుఁడు కాఁగా, దీక్షితులకుఁ గాకున్నను, శివునికే దయగలిగి ఆయన దృష్టిమార్గమున నడ్డముగనున్న రాతినందిని ప్రక్కకుఁ దొలఁగుమని యానతిచ్చెను. నందుఁ డంత దూరమునుండియే స్వామిదర్శనముచేఁ గృతార్థుఁడై చెంత నొక తటాకమును ద్రవ్వి తన యూరి కేఁగెను. తర్వాత నటరాజమూర్తిని దర్శింప నతఁడు చిదంబరమునకుఁ బోవఁగా, దీక్షితులు అతనికి దేవాలయప్రవేశము నిరాకరించిరి. స్వామి దీక్షితులకు స్వప్నమునఁ గన్పించి యగ్నిశుద్ధుఁడైనచో నందుఁడు తన్ను దర్శింపవచ్చు ననెను. నందుఁ డట్లే యగ్నిశుద్ధిచేఁ బవిత్రుఁడై స్వామిని దర్శించి తద్దైక్యము నందెను.

4. ఏఁబదియేండ్లక్రిందటి గోపాలకృష్ణభారతి నందనారుహరికథను రచించెను. దానిలో విశేషము, నందనా రొకబ్రాహ్మణుని పాలేరు. ఇతనిభక్తికిఁ గినిసి యజమానుఁడు ఇతనిని కష్టములపాలు చేసెడివాఁడు. నందుఁ డతనిని పలుమారు వేఁడుకొనఁగా కడకుఁ గరుణించి ఇన్నూఱెకరముల పైరును గోసి కుప్పవేసి పిమ్మట చిదంబరమునకేఁగుమని యతఁ డనెను. అతిమానుషరీతి నీకార్య మొకదినమున నే నెఱవేఱినది.

ఈకావ్యమున నందనారు బలిష్ఠుఁడనియు శివస్మరణ సేయనొల్లని తనచెలికాండ్ర మర్దించి యట్లు సేయ నిర్బంధించెననియు మద్యపానాదుల నిషేధించెననియుఁ జెప్పఁబడియున్నది.

5. సంస్కృతమున '<u>ఉపమన్యువిలాసము</u>'నందు '<u>శివరహస్య మాహాత్మ్యఖండము</u>'న '<u>శ్వోగంత్ర్చరిత</u>' మున్నది. శ్వోంగత్రుపదము

నందనా రాదనూరు గ్రామవాసి. శివకైంకర్యము సేయుట కొఱకును వాద్యములకయి దేవాలయపుమంగళ్లకుఁ దోళ్లు బాగొనరించి యిచ్చు వాఁడు. సమీపమునఁ 'దిరుప్పంగూరు' శివుని జూచుట కెంతయు నం దుఁడు ప్రయత్నించి విఫలుఁడు కాఁగా, దీక్షితులకుఁ గాకున్నను, శివునికే దయగలిగి ఆయన దృష్టిమార్గమున నడ్డముగనున్న రాతినందిని ప్రక్కకుఁ దొలఁగుమని యానతిచ్చెను. నందుఁ డంత దూరముననుండియే స్వామిదర్శనముచేఁ గృతార్థుఁడై చెంత నొక తటాకమును ద్రవ్వి తన యూరి కేఁగెను. తర్వాత నటరాజమూర్తిని దర్శింప నతఁడు చిదంబర మునకుఁ బోవఁగా, దీక్షితులు అతనికి దేవాలయప్రవేశము నిరాకరిం చిరి. స్వామి దీక్షితులకు స్వప్నమునఁ గన్పించి యగ్నిశుద్ధుఁడైనచో నందుఁడు తన్ను దర్శింపవచ్చు ననెను. నందుఁ డట్లే యగ్నిశుద్ధిచేఁ బవి త్రుఁడై స్వామిని దర్శించి తదైక్యము నందెను.

4. ఏఁబదియేండ్లక్రిందటి గోపాలకృష్ణభారతి నందనారుహరి కథను రచించెను. దానిలో విశేషము, నందనా రొకబ్రాహ్మణుని పాలేరు. ఇతనిభక్తికిఁ గినిసి యజమానుఁడు ఇతనిని కష్టములపాలు చేసెడివాఁడు. నందుఁ డతనిని పలుమాఱు వేఁడుకొనఁగా కడకుఁ గరు ణించి ఇన్నూఱెకరముల పైరును గోసి కుప్పవేసి పిమ్మట చిదంబరమున కేఁగుమని యతఁ డనెను. అతిమానుషరీతి నీకార్య మొకదినముననే నెఱ వేఱినది.

ఈకావ్యమున నందనారు బలిష్ఠుఁడనియు శివస్మరణ సేయనొల్లని తనచెలికాండ్ర మర్దించి యట్లు సేయ నిర్బంధించెననియు మద్యపానా దుల నిషేధించెననియుఁ జెప్పఁబడియున్నది.

5. సంస్కృతమున 'ఉపమన్యువిలాసము'నందు 'శివరహస్య మాహాత్మ్యఖండము'న 'శ్వోగంత్సచరిత' మున్నది. శ్వోంగత్సపదము

...

వృత్తమునఁ గాకున్నను పాత్రనిర్వహణమున స్వాతంత్ర్య మవలంబించితిని. విశ్రుతుఁడగు నందునికిఁ దామసికప్రవృత్తులును వర్ణితములు. ఈ నాటకముననో నందుఁడు పరమసాత్త్వికుఁడు. సంపూర్ణముగ నటరాజుపై భార మిడి నిశ్చింతుఁడై యుండువాఁడు. దేవాలయప్రవేశమునను అతని కంతపట్టుదల యున్నట్లు చూపట్టదు. ఆయుద్యమమంతయు విశ్వనాథభట్టరుదే. భట్టరునందు సన్మార్గమునసైనను రజఃప్రవృత్తి ఆదినుండి వర్ణించియే యున్నాను. రజఃప్రవృత్తిఫలము ఎట్లుండునో సూచితము. కేవలపురుషకారము ఫలదాయకము కాదనియు దైవమే ఫలదాయకమనియు రామాయణమున రామునిచే నుపన్యస్తమైన ధర్మము నిందుఁ బ్రతిపాదింప యత్నించియున్నాను. వాచ్యముగఁ గాకున్న నంతర్లీనముగ భక్తిసిద్ధాంతసూత్రముల నందందుఁ దడవియున్నాను. విజ్ఞులకు విస్తరించి చెప్పఁబని లేదు.

## ఉ ప దే శ ము.

ఏధర్మమునుగాని ప్రతిపాదింప నెంచుటయే ప్రధానముగ నే నీ నాటకమును రచింపలేదు. హరిజనులకు దేవాలయప్రవేశ మిం దంగీకరింపఁబడెనా లేదా యనుటయందు నిరుపక్షములవారి కనుకూలముగ వాక్యము లిం దనేకములు గాన్పించునుగాని నా కే సిద్ధాంతమును జేయవలయునను నుద్దేశ్యమును లేదు. వృత్త మొకటియైనను జనులు దాని వలన గ్రహించు నుపదేశము అధికార తారతమ్యము ననుసరించి దేశకాలపాత్రములచే నియతమై యుండునని నాతలంపు కావన నిందు ప్రవచనము కాఁకుఁ గాక కథ కేవలము వృత్తచిత్రణమునకే స్వీకరింపఁబడినది. సాధ్య మగునంతవఱకు నాఁటిజానపదధర్మజీవనమును చిత్రించితిని. ప్రవచనమే ప్రధానమైనచో రచన కళాప్రధానము గాకుండును. రచనాసౌందర్యములేని కళ కళయేగాదు. కాని కేవలము **Art for art** సంప్రదాయమునందును నాకు నమ్మకము లేదు. ఏరచనయైనను భావమునకు

వ్యక్తరూపము. ఈరూపమును గాంచినవారికిఁ దత్తదనుగుణముగ వివిధభావములు స్ఫురింపకపోవు. కావుననే రచన ధర్మసమ్మితముగ నుండవలయునని యాలంకారికులనిర్ణయము. కావ్యము కాంతాసమ్మిత మనుటచే వారియభిప్రాయము ఆనందజనకముగ నీతినే చెప్పుమనియే కాని నీతినే ప్రపంచింపుమని గాదు. దానికి శాస్త్రాదు లున్నవి. ఈ దృష్టి నాధునికులందుఁ గొందఱు నిరసింతురనియు వారికి Purposeless art (ఉద్దేశ్యవిహీనమైన కళ) రుచింపదనియు నెఱుంగుదును. కాని ఈనాటకమును రచించిన నాయభిప్రాయము తెల్లము సేయకున్నచో ననావశ్యకముగఁ బొరపడుదురని యట్లు సేయవలసివచ్చెను. నాయుద్దేశ్యమును ప్రథమముద్రణమున ఇట్లు విస్పష్టము చేసితిని.

“భక్తచరిత్రపఠనమునను భక్తిసిద్ధాంతపర్యాలోచనమునను భక్తజనదర్శనమునను నామనమున నుదయించినభావములు ఈ నాటకరూపమును దాల్చినవి.”

## భాషా విషయము

పాత్రానుగుణముగ గ్రామ్యమును మాగురుపాదులు వేంకటరాయశాస్త్రులవారు వారినాటకముల నెలకొల్పిరి. నేనును వారిపథమునే యనుసరించితిని. కాని వ్యాకరణవిషయమున మాగురువుల యుపదేశము నిందుఁ గొన్నిచోటుల నతిక్రమించితినని విన్నవింపవలసియున్నది. సిద్ధాంతవిషయమున వారిమతమే నాకు నుపాదేయము కాని నాటకమున వ్యవహారానుకరణమే పరమప్రయోజనము గావున ఒకటి రెండు చోటుల వ్యాకరణనియమములను నతిక్రమింప సాహసించితిని; అఖండయతి రేఫద్వయమైత్రి అచ్చుపై ద్రుతసంశ్లేషము ఇత్యాదు లటనట మదంగీకృతములు. విజ్ఞులకు చెప్పవలసిన దేమి? ఏప్రయోజనము నర్థించి యీపాటిసాహసమునకు నేఁ దొడంగితినో దానిన పరికించి సైరింతురుగాత మని నాప్రార్థనము.

## నాటకసంప్రదాయము

సంస్కృతనాటకములకు ఆలంకారికులు లక్షణముల నిర్ణయించి యున్నారు. ఆంగ్లనాటకములకు అంకాదినిర్మాణమున నిర్ణయము లేకున్నను సంప్రదాయము కలదు. తెనుఁగునాటకముల కింతవఱకు సంప్రదాయ మేర్పడలేదు. కావున మాగురువులపద్ధతి ననుసరించి సాధ్యమగు నంతవఱ కిందు సంస్కృతనాటకనిర్మాణమునే యనుసరించితిని. ఏలయన నది రసవ్యక్తీకరణమున కుపయుక్తమనియు నధునాతనాంగ్లేయ నాటకకర్తలును యాదృచ్ఛికముగనే తల్లక్షణానుసారమే రచించుచున్నారనియు నాయభిప్రాయము. పండితవరేణ్యులు బ్రహ్మశ్రీ వఝుల చినసీతారామస్వామిశాస్త్రిలవారీవిషయమున నీనాటకమును బరిశీలించిన రీతిని వారి వాక్యముల నేనిం దుదాహరించెదను.

## "లక్షణానుసరణము

పండితజనవ్యవహారమునుబట్టి భాషానియమము లేర్పడుచున్నట్లును, సదాచారములనుబట్టి ధర్మనియమము లేర్పడుచున్నట్లును గవుల గ్రంథములనుబట్టియే కావ్యనియమములును నేర్పడుచుండును. కాన ప్రతిభాశిల్పశాలి యగు కవిచే రచింపఁబడిన కావ్యమునే కావ్యలక్షణము లనుసరించుచుండును. కాఁబట్టి ప్రతిభాశిల్పములుగల కవిగ్రంథమునం దయత్నసిద్ధముగనే వెలసిన కావ్యలక్షణములు పొడకట్టుచుండును.

"నాటకం ఖ్యాతవృత్తం స్యాత్పంచసంధిసమన్వితమ్।
పంచాధికా దశపరా స్తత్రాంకాః పరికీర్తితాః।
ప్రఖ్యాతవంశో రాజర్షి ర్ధీరోదాత్తః ప్రతాపవాన్।
దివ్యోఽథ దివ్యాఽదివ్యో వా, గుణవా న్నాయకో మతః।

ఏక ఏవ భవే దంగీ శృంగారో వీర ఏవ వా।
అంగ మన్యేరసా స్సర్వే, కార్యం నిర్వహణేఽద్భుతమ్॥

(సాహిత్యదర్పణము ౬-౨౭౭)

నందనారుచరిత్రము సుప్రసిద్ధము. నందనారు దివ్యాదివ్యపురుషుఁ డనఁదగును. ఇం దంకము లెనిమిది. నందనారు ధీరోదాత్తనాయకుఁడు. దేవాంశజుఁ డగుటచే వంశము వివక్షింప నక్కఱలేదు.

నందనారు మాలయనియు మాలలకు దేవాలయప్రవేశాదులు ధర్మ్యమని యీనాటకము స్థాపించుచున్నదనియుఁ గొందఱు భ్రమింతురు. కాని యది గ్రంథకర్తృహృదయము కాదని చెప్పనగును. నందనారుతో వచ్చిన మాలలకెల్ల దేవాలయప్రవేశ మిందు వర్ణితము కాలేదు. అధిగతాద్వైతజ్ఞానియు జీవన్ముక్తుఁడునునగు నందనారునకును నట్టివారికిని దేవాలయప్రవేశ మిం దంగీకరింపఁబడుచు వచ్చెను. అందును నందనారునకు సైత మగ్నిశుద్ధ్యనంతరము దేవాలయప్రవేశము వర్ణిత మయ్యెను.

బ్రహ్మైవాఽహ మిదం జగచ్చ సకలం చిన్మాత్రవిస్తారితం।
సర్వం చేద మవిద్యయా త్రిగుణయా సేశం మయా కల్పితమ్।
ఇత్థం యస్య దృఢా మతిః సుఖతరే నిత్యే పరే నిర్మలే।
చండాలోఽస్తు సతు ద్విజోఽస్తు గురు రిత్యేషా మనీషా మమ॥

(౭ అంకము)

అని యీరీతినిగదా విశ్వనాథభట్టరుచే గ్రంథకర్త ప్రసంగింపఁ జేయుచువచ్చెను.

మాలయ పైన నేమి ? యనుమానము లేదు; శుభుండు; బ్రహ్మానూ
త్రాలుపఠించునర్థము ముదమ్మున మూర్తి ధరించె నిట్టు, లా

బాలసుధాంశుశేఖరునిబంధురతేజముగాని వేఱె
పాల దహించువా రయిన భక్తి భజింపుఁడు

విశ్వనాథభట్టరు పీఠమర్దనాయకుఁడు.

దూరానువర్తిని స్యాత్తస్య ప్రాసంగికేతి
— 'కించిత్తద్గుణహీనః సహాయ ఏవాస్య పీ
(సాహి 3

నటరాజభట్టరు, అప్పయ్యాదీక్షితుడు, మున్నగు
కాదులు.

నందనారుచరితమునం దంగిరసము ధర్మవీరమనఁ
ధర్మవీరుఁ డనఁదగును. చిదంబరములోనినటరాజస్వామి
నారు తత్సాయుజ్యరూపమగు ముక్తినందుటయే యిందలి
రాజస్వామిదర్శనవిషయమున నత్యంతదుష్కరకార్యమ
యత్నించునందనారుభక్తుని మహోత్సాహమే యిం
నకు స్థాయిభావము.

ఉత్తమప్రకృతి ర్వీర ఉత్సాహ స్థాయిభా:
సచ దాన ధర్మ యుద్ధై ర్దయయాచ సమ

(సాహిత్యదర్పణము. 3 ప

ప్రథమాంకమునందలి కుప్పనిప్రసంగమునం
పారవశ్యవర్ణనాదికముచే బీజసంధి వెలయుచున్న
సంధియనియుఁ జెప్పదురు.

"యత్ర బీజసముత్పత్తి ర్నానార్థరససంభవా
ప్రారంభేణ సమాయుక్తా తన్ముఖం పరికీర్తితమ్"

(సాహి-ఒ పరి-333)

౨-౩-అంకములందు నందనారుభక్త్యావేశము హెచ్చిన వర్ణనములందును నతనిభక్తిశ్రద్ధల నడంచు మాలలయత్నములందును బీరమర్దుఁడనఁదగు విశ్వనాథభట్టరుతోడిసాంగత్యము నడంచు మాలలయు నటరాజాదులయుఁ బ్రసంగములందును ప్రతిముఖసంధి వెలయుచున్నది.

ఫలప్రధానోపాయస్య। ముఖసంధినివేశినః।
లక్ష్యాలక్ష్య ఇవోద్భేదో। యత్ర ప్రతిముఖంచ తత్॥

(సాహి - ఒ పరి - ౩౩౪ - కా)

చతుర్థపంచమాంకములందలి నందనారుభూతదయ—భక్తి పారవశ్యము - నటరాజభట్టరుకోపావేశము - నందనారును దండతాడితుఁ జేయుట - నందనారుశరీరమునందుఁ దాడనపీడ లేకుండుట - నటరాజభట్టరునందలివికృతి - నందనారు చిదంబరస్వామిదర్శనమునకుఁ బోననుజ్ఞ వేఁడఁగా నటరాజభట్టరు దుష్కరశాసనము చేయుట మున్నగు సందర్భములలో గర్భసంధి వెలయుచున్నది.

ఫలప్రధానోపాయస్య ప్రాగుద్భిన్నస్య కించన!
గర్భో యత్ర సముద్భేదో హ్రాసాన్వేషణవాన్ముహుః॥

(సాహి-ఒపరి- ౩౩౫ కా)

ఒ-౭-అంకములందు వర్ణితములగు నందనారుభక్తిపారవశ్యము, దుష్కరకార్యనిర్వహణరూపమహాసామర్థ్యము, భగవత్ప్రసన్నత, చిదంబరప్రయాణము, దేవాలయసమీపాగమనము, నందిచలనము మున్నగు కావ్యఫలసామగ్రీప్రకాశసందర్భమందును నగ్నిపరీక్ష మున్నగు దురుత్తరాంతరాయవర్ణనసందర్భమందును విమర్శసంధి వెలయుచున్నది.

యత్ర ముఖ్యఫలోపాయ ఉద్భిన్నో గర్భతోఽధికః
శాపాద్యైస్సాంతరాయశ్చ స విమర్శ ఇతిస్మృతః॥
(సాహి - ౬ పరి - ౩౩౬ కా)

ఎనిమిదవయంకమునం దత్యద్భుతమగు నగ్నిశుద్ధి, నందనారుటరాజస్వామియంకము నధిరోహించి సాయుజ్యమునందుట మున్నగు ఘట్టమున నిర్వహణసంధి సుఘటిత మగుచున్నది.

కార్యం నిర్వహణేఽద్భుతమ్॥
బీజవన్తో ముఖాద్యర్థా। విప్రకీర్ణా యథాయథమ్।
ఏకార్థ ముపనీయంతే। యత్ర నిర్వహణం హి తత్॥
(సాహి - ౬ పరి - ౩౪౭ కా)

విస్తరభీతి నుదాహరింపనయితినిగాని పయిరీతినే సంధ్యంగములు మున్నగు తక్కిన నాటకలక్షణములెల్ల నిందు సుప్రయుక్తము లయి యున్నవి.

20-4-1938.
విశాఖపట్టణము

ఇట్లు విన్నవించు సుజన విధేయుఁడు
పరుఘుల చిన సీతారామస్వామిశాస్త్రి."

## క్షేత్రము.

ఇంక నొక్క విషయముమాత్రము ప్రస్తావించి యీ పీఠికఁ బూర్తిగావించెదను. ఈకథకు రంగము కావేరీతీరమునఁ జిదంబరక్షేత్రము. ఈక్షేత్రమాహాత్మ్యము స్కాన్దపురాణమున వర్ణితమై యున్నది. పూర్వము కావేరికి నుత్తరశాఖయగు కొల్లడము ఈక్షేత్రముచెంతనే ప్రవహించుచుండిన దందురు. ఇది విఖ్యాతశైవక్షేత్రము; పంచలింగముల నాకాశలింగస్థానము. ఇందు ముఖ్యదేవుఁడు శివకామసుందరీనామకదేవీసమేత

దారుకావన తా



నటరాజదేవుఁడు. ఈక్షేత్రమునకు నాదేవత లవతరించినరీతి స్కాన్ద మున నిట్లభివర్ణితము;—

పూర్వము దారుకావనతాపసులను బరీక్షింప హరిహరులు సైజ మూర్తు లడంచి సుందర స్త్రీపురుషరూపముల దారుకావనమున కేఁగిరి. క్షణములో నందలి స్త్రీపురుషజనచిత్తములు మోహసంభ్రాంతము లాయెను. అందు కొందఱు ప్రకృతింగని కోపావిష్టులై శివునిమీఁదికి నాభిచారికకృత్యాదులఁ బ్రయోగించిరి. శివుఁడును రుషచే త్రిలోకసంహార సమయమునఁ బ్రయుక్తమగు చండతాండవము నారంభింపఁగా నెల్లరును - పార్వతిసైతము - భయంపడిరి. అంత నాయన దానిని మాని యానంద తాండవమును చేసెను. దీనులగు తాపసుల ననుగ్రహించెను.

ఆయానందతాండవమును కనఁగోరి శేషాహి తపసింపఁగా భవుఁ డాయనను భూలోకమునఁ బతంజలియవతార మెత్తి ఈయుద్దేశ్యము తోనే తప మొనర్చు వ్యాఘ్రపాదమునీంద్రుచెంత కేఁగు మనెను. వ్యాఘ్రపాదుఁడు తిల్వవనమున నుండెను. తిల్వవనము చిదంబరమునకు నామాంతరము. అందు యుక్తసమయమున వారికిని ఇతరదేవతాజనములకును శివుఁడానందనృత్తప్రథమావతార దర్శన మొసంగెను. తదుపరి వ్యాఘ్రపాదుఁడే కోరఁగా నందే నిత్యము నివసింప నంగీకరించెను.

చిదంబర మన జ్ఞానాకాశమని యర్థము. దీనికే దభ్రాకాశ మనియు దహరాకాశ మనియు (సూక్ష్మమగు నాకాశమనియు) నామములు. శరీరమున దహరమున నాత్మవలె శివుఁడు ప్రపంచదేహమున చిదంబరమున నున్నాఁడఁట.

తరువాత నిందు సింహరూపధారియగు రాజుతుఁ డొకఁడు దేదీప్యమానశరీరమును బొంది హిరణ్యవర్మ యను నామమును గాంచెను. అతఁడే యిందు హిరణ్మయముగా గోపురాదికముల నిర్మించినవాఁడు. నట

రాజేశునిసభకు కనకసభయని పేరుండుట దీనివలననే. జ్ఞానపరముగా కనక సభకు చిత్సభ యనియుఁ బేరు గలదు.

ఈక్షేత్రమున సర్వపాపఘ్నమని కీర్తిగాంచిన తీర్థ మొకటి యున్నది. దాని నామము శివగంగ.

ఈ క్షేత్రపాలనమునకై హిరణ్యవర్మ మూఁడువేలబ్రాహ్మణులను దేఁగానం దొకఁడు కనరానందున నతఁడు విషాదము పొందెను. శివుఁడే యా స్థానమును దాను గ్రహించెను. ఈ బ్రాహ్మణులసంతతివారే నేఁటి కిని దీక్షితవంశనామధరులై అందు క్షేత్రపాలకులుగ నున్నారు. కనకసభ యందు వీరందఱికి స్థానము గలదు. వీరికి సభాపతి నటరాజయినను వ్యవ హారమున కొకపెద్ద నంగీకరించి వీరందఱు వర్తింతురు.

ఈ విషయము లన్నియు నటనట నాటకమునఁ బ్రస్తావింపఁబడి యున్నవి.

ఇంతకన్న విశేషమును నేను విన్నవింప నక్కఱ గానరాదు.

కరోమి యద్య త్సకలమ్ పరస్మై
నారాయణాయేతి సమర్పయామి.

గ్రంథకర్త.

ప్రజ్ఞానపాద శ్రీ చరణయోః

సమర్పితమ్.

# స్మృతి

---

వరకవితావివేకము, నపారసుధామయపేశలోక్తిఁ, గ
మ్రరచనసేయు నేర్పును, బురాకవిరాజపథానువృత్తియున్
మరపి ప్రమాణకావ్యరుచిమాలిక నాదికళాప్రపూర్ణుఁడౌ
స్థిరయశు సద్గురూత్తముని దెల్పెద వేంకటరాయధీనిధిన్.

"అదె దుష్యంతుఁడు వచ్చు; వాఁడె, యనిరుద్ధాభిఖ్యుఁ
డే తెంచెడున్;
అదె చూడుండు ప్రతాపరుద్రుఁ"డని తా వత్సా బాలగోపాల
మున్
మదినూహించెద రెవ్వనిన్ గనిన నామాన్యుం గళాభిజ్ఞుఁ బే
ర్మి దలిర్పం దొరసామి నాట్యగురు మన్మిత్రున్ హృదిన్
నిల్పెదన్.

అందఱు వత్సకుల్ గలసి యాడుచు ముగ్ధతఁ బాంసుకేలి ను
న్నందరహాసమోదములు నాట్య మొనర్చునుసీదు మోమునం;
దం దొకరుండు సేసె నని యాదట బాలునిలీల దీని నో
సుందరరామమాంబికరొ చూడఁగ నీవిల లేవ యక్కటా.

# కథాసంగ్రహము

పూర్వకథ:—కావేరిదక్షిణతీరగ్రామము ఆదనూరు. దాని మిరాశీదారు నటరాజభట్టరు. అతనికుమారుఁడు విశ్వనాథభట్టరు చిన్ననాఁటనే కాశికిఁ బోయి విద్వాంసుఁడై, గురువు 'గార్హపత్యముననే ముక్తిని పొందు' మనియు, అన్నపూర్ణ కలలో "మీయూరనే నీకు ముక్తిమార్గ ముపదేశ మొనర్చు గురువు లభించు" ననియుఁ జెప్పఁగా తనయూరికిఁ దిరిగి వచ్చును.

అంకము ౧. ఊరు చేరఁగానే విశ్వనాథునికి మాలకుప్పనివలన కుప్పని మేనల్లుఁడు నందుఁడు గొప్పభక్తుఁ డని తెలియుట.

అంకము ౨. గ్రామదేవతజాతరలో మాలదాసరి ఆవేశమున నాడుచు విశ్వనాథుఁడు మాలవాడఁ జొచ్చి నందునితో భజనసేయుచున్నందున వాడయందు వ్యాధులు జనించె ననుట. మాలలు నటరాజభట్టరుతోఁ జెప్పుకొన వెడలుట.

అంకము ౩. నటరాజభట్టరుపరితాపము. పురాణశ్రవణము జరుగుచుండఁగా నందుఁడు భావవేగముచే మూర్ఛిల్లుట. విశ్వనాథుఁడతనిని తాఁకి తేర్చుట. బ్రాహ్మణులకోపము.

అంకము ౪. నటరాజభట్టరు పొలము కాచుచు మైమఱచి పైరును పశువులకుఁ బెట్టిన నందుని మర్దించుట. నందునిక్షమ.

అంకము ౫. నందశరీరస్పర్శముచే మనసుమాఱిన నటరాజభట్టరు పైరును గోసి కుప్పవేసినచో చిదంబరమునకు పోవుట కనుజ్ఞ నిత్తు ననినందునితో చెప్పుట.

అంకము ౬. నందుఁడొకదినములో ఇనుప్పైకరముల పైరును గోయించుట. నటరాజభట్టరుపశ్చాత్తాపము, నందుని చిదంబర ప్రయాణము.

అంకము ౭. నందుని నటరాజదేవాలయములోనికి ధర్మకర్త అప్పయ్యదీక్షితుఁడు రానీయకుండుట. విశ్వనాథుఁడు శివప్రసాదమునకై ప్రాయోపవేశదీక్ష పూనుట.

అంకము ౮. దేవునియాజ్ఞానుసారము అగ్నిపరీక్ష చేసి నందుని లోనికిఁ దీసికొనిపోవచ్చునను దీక్షితులనిశ్చయము. చిన్నమ్మభీతి. అగ్నిప్రవేశము. కనకసభలోని నటరాజమూర్తిని నందుఁడు కౌఁగిలించికొని ఆనందాతిశయమునఁ బ్రాణములఁ గోల్పోవుట. విశ్వనాథునిదుఃఖము.

# పాత్రవర్గము

పురుషులు:

౧. నటుఁడు
౨. నందుఁడు
౩. విశ్వనాథభట్టరు
౪. నటరాజభట్టరు
౫. పరాశరభట్టరు
౬. ఇద్దఱు బ్రాహ్మణులు
౭. నీలకంఠదీక్షితరు
౮. సుబ్రహ్మణ్యదీక్షితరు
౯. శివరామదీక్షితరు
౧౦. అప్పయ్యదీక్షితరు
౧౧. కుప్పన్న
౧౨. కుట్టన్న
౧౩. కరుప్పణ్ణ
౧౪. ఇరులను
౧౫. ఇరువురు మాలలు
౧౬. దాసరి
౧౭. పడవవాఁడు
౧౮. మురుగప్పమొదలి

స్త్రీలు:

౧. చిన్నమ్మ

శ్రీ

# నందనారు చరితము

---

శ్రీనాథాత్మజు ఫాలనేత్రము సెగన్, శీతాద్రిరాట్కన్యకన్
వానప్రస్థను లోచనద్వయిసుధన్, భంగించు పోషించు నా
యానందాత్మకుఁ డిచ్చు మీకు నిరతమ్మాత్మైకవిజ్ఞానమున్
ఆనందప్రథమావతారరసధుర్యం బార్యసాహిత్యమున్. 1

[నాంద్యంతమున నటుఁడు ప్రవేశించి]

ఆర్యమిశ్రులకు విన్నపము. నందభక్తచరితామృతబిందుస్వీకర ణోన్మత్తుఁడై కవి తత్కథను నాటకముగా నిబంధించినాఁడు. సధర్ములు రసికులునగు మి మ్మిట్లు వేఁడుకొనుచున్నాఁడు.

శ్రీరమణార్షి పాదసరసీజమధుప్రియబంభరస్వనా
పూరమ యీవచస్సు; బుధపూజ్యగుణాఢ్యుఁడు నంద
యోగియున్;
బారములేని భక్తియ యుపాయము దీన రసంబు గ్రోలఁగా;
సారమె యున్నఁ గ్రోలుఁడి, యసారమొ పీడుఁడి భక్తబృం
దముల్. 2

(నేపథ్యగృహమువంకఁ జూచి) ఓహో, అప్పుడే నా చెలికాఁడు హారీతుఁడు విశ్వనాథభట్టరువేషము దాల్చి యిట్లే వచ్చుచున్నాఁడు. నేనును లోని కేఁగి యనంతరకరణీయము నిర్వర్తించెదనుగాక.

[అని నిష్క్రమించును.]

---

శ్రీ

# నందనారు చరిత

## ప్రథమాంకము

స్థలము:—ఆదనూరు పొలిమేర.

[అంతట ప్రయాణఖిన్నుఁడు, విశ్వనాథభట్టరు

విశ్వ:—

సంజకెంజాయ శమియించెఁ జరమదిశను
వన్నెమీఱెడు నైల్యానఁ బరిథవిల్లుఁ
దారకామణిపంక్తుల తరళరుచులు;
శాంతి విలసిల్లు నిచట నేకాంతనిరతి.

ఇదె మాయూరిపొలిమేరఁ జేరితిని. ఎట్టి
ముదము నించును. ఇఁక మాయూరు, అందును

మధుర నిత్యసలిల మహనీయ కావేరి;
చెంత సిరుల నించు క్షేత్రచయము;
కవివరాళి నెలవు, కర్మఠవాసమ్ము;
ఆదనూరుసాటి యవనిఁ గలదె?

ఎదురుచూడని నారాకకు మాతలిదండ్రులు
(పరిక్రమించి పరికించి) ఎవరక్కడ! కుప్పఁడా!
ముదిమి యేల కల్గినది? పిలిచెదనుగాక. కుప్పా

[అంతట గుంటకన్నులతో దండ మూఁతకొని కుప్పఁడు ప్రవేశించును.]

కుప్ప:—ఎవరు, సామీ, నన్ను పిలిచింది ? ముసలోణ్ణి. కళ్ళగపడవు.

విశ్వ:—నన్నుఁ దెలియవా కుప్పా ? నేను విశ్వనాథుఁడనుగదా.

కుప్ప:—ఎవరు ? శిన్నయ్యోరా ? సామీ ! (సంభ్రమముతో) నిజముగా శిన్నయ్యోరేనా ?

విశ్వ:—అవును, కుప్పా, నేనే.

కుప్ప:—ఎప్పుడొచ్చారు సామే ! ఎక్కడికి పోయినారు సామీ ! ఎవరికి శెప్పకుండా ఎల్లినారేమయ్యా ! ఈనాటి కిల్లు గెప్తి కొచ్చిందా సామీ ! పెద్దముండావోళ్ళము, మీ రొచ్చిందాకా ఉన్నాము, అదేసాలు [స్వగ] యీళ్ళమ్మపోయినసంగతి తెలుసునో లేదో ? అయినా వూరికి రాగానే మొదంట నే నెందుకు శెప్పటం ?

విశ్వ:—కాశికిఁ బోయి చదివివచ్చినానురా ! కుప్పా, అందఱు క్షేమముగ నున్నారా ?

కుప్ప:—అదే చేమం, ఎక్కడికి బాబయ్యా ! ఏదో తమదయశాత అంతా బాగానే ఉన్నాము.

విశ్వ:—కుప్పా, నీమేనల్లుఁడు నందుఁడు బాగుగ నున్నాఁడా ? వాఁడిప్పుడు పెద్దవాఁడై యుండును. పెద్దమాల వాఁడేనా ?

కుప్ప:—ఏం శెప్పేది బాబయ్యా !

విశ్వ:—ఏమిరా, ఏమి ! బాగుగా నున్నాఁడుకదా ?

కుప్ప:—బాగా ఉన్నట్టే. (దుఃఖముతో) పిచ్చోడయినాడు సామీ !

విశ్వ:—పిచ్చియా ?

కుప్ప:—అవును. మీ గెల్లిన ఒకయేటికి గావాఁలె, ఆడమ్మ పోయింది. కొన్నాళ్లెవరితోను మాటాడేవోడు కాడు. కూడు సరిగ తినేవోడు కాడు. అమ్మపోయినశింత అనుకున్నాము సామీ!

విశ్వ:—తర్వాత?

కుప్ప:—ఒకదినము మాపటియే లిక్కడికే పొలంపనిమీద పంపించాము, బాబయ్యా. ఇదుగో, ఇక్కడనే, ఉండట్టుండి దడాలున క్రింద బడిపోయినాడంట-కుట్టడు పరుగెత్తుకొచ్చి పల్లెలో శెప్పినాడు. మే మొచ్చేసరికి తేరుకున్నాడు గాని అదేంటిమాటలో సామీ! 'చివచివ'ని తప్ప మాటలేకపోతే నే! ఆబాసే మా కద్దం కా లేదు. ఏదో 'యెలుగం'ట, 'బూతాలం'ట, 'ఆత'మంట, 'పాన'మంట, 'మోచ్చ'మంట, ఏందేందో మాట్లాడినాడు, మరేం శెప్పేది.

విశ్వ:—(స్వగ) మాతా, అన్నపూర్ణేశ్వరీ! ఇదియేనా నీవరము! (ప్రకా) తర్వాత?

కుప్ప:—పిచ్చి తగ్గలేదు. నాలుగేళ్లయింది. సేద్దెం నాద్దెం పోయింది. పూజలూ, పునస్కారాలూ; బుద్దులు శెప్పేటప్పుడు తలూచేవోడే. మరుదినమే యదాపకారం. కోవెలమంగలోళ్లకు శర్మాలు బాగుచేసిచ్చేవోడు, "మనకులవృత్తి" కాదురా అంటే యినడు. బదులు పలకడు. నే నూరుకుండినా బాగుణ్ణు బాబయ్యా.

విశ్వ:—ఏమి చేసితివి?

కుప్ప:—పెళ్లయితే యీపిచ్చి గుదురుతుం దేమో అని ఆడికి శిన్నమ్మ నిచ్చి పెళ్లిచేసినా.

విశ్వ :—చిన్నమ్మ......యెవరురా ?

కుప్ప :—మాపిల్ల. అందుకే ఇప్పుడు గొంతుగోసుకోవా లనిపిస్తది. యీణ్ణి యీళ్ల నాయిన పోయినప్పట్నుంచి పెంచి పెద్దోణ్ణిచేసి, నా కొక్కటే కూతురు, ఇచ్చి పెళ్లి శేస్తే మొదటినాలుగునెల లేమోగాని మళ్లా దానిమొగము సూళ్లేదు బాబయ్యా. నాపిల్లనిసూత్తే లచ్చిమంటా రందరు-దాన్ని ఏడిపిస్తావుండాడు. సూస్తే కడుపు తరుక్కుపోతుంది. ఈడెక్కుమాలినోడు ఏగోతిలో ఏగుంటలో పడతాడో అని ఆపిల్ల ఈణ్ణే కనిపెట్టుకుంటుంది. [కోపముతో] ఈడమ్మా సిగ దరగ. 'చివచివం'ట ఈడి మొగమ్మండ.

విశ్వ :—కుప్పా, మేనల్లుఁడే ! అట్లు అనవచ్చునఁటరా ?

కుప్ప :—ఏమిశేశేది సామీ, నాకడుపులో చిచ్చు పెట్టినాడు. నా తల్లిమొగాన నవ్వే మాయమయింది దేవరా. (కోపముతో) పని పాట లేకుంటే, ఆకాసాని కేసి సూస్తావుంటే, నోట్లో ముద్దొచ్చి పడుతుందా బాబయ్యా? ఈ పాయం ముసలోణ్ణి, నా రెక్క లాడకపోతే పస్తే బాబయ్యా! ఎద్దాలె యిరవయ్యేదేళ్లొచ్చాయి. పని లేదు పాట లేదు. 'చివచివం'ట!

విశ్వ :—కుప్పా, కష్టపడఁబోకు. ఇది మంచికే వచ్చినది. మీనందునిమూలమున మీ రందఱు తరించిపోవుదురు.

కుప్ప :—ఏమ్మంచో, సామీ తరించతానే ఉండాము!

విశ్వ :—మీరుమాత్రమే గాదు, మీకులమంతయు. వారేనా ? లోకమంతయు. జగన్నాథునికి మీకుటుంబముపై ననుగ్రహము కలిగినదిరా. ధన్యుఁడ వయినాఁడవు కుప్పా, మహాభక్తశిరోమణి మీ యింట నున్నాఁడురా.

కుప్ప :—ఏమన్నారు, సామీ ?

విశ్వ :—(పరధ్యానముతో, స్వగతము) ఆహా !

ఏమి వచింపనేర్తు నిఁక ; నీదృశమైన మహానురాగముల్
సోమకళావిభూషణుఁడు చూపెడి జీర్ణకుటీరవాసిపై !
సామసుగీతికానినదసారవినోదియు బేలవాక్కులన్
ప్రేమ గ్రహించెనో శ్రవణపేయముగా ; నిది యేమి భాగ్య
మో ! 5.

కుప్ప :—(స్వగ) ఈయనికిగూడా ఆపిచ్చేనా యేంటి ? ఈకాలం కుఱ్ఱోళ్లంతా ఇట్టవుతుండా రేమబ్బా ! (ప్రకా) ఏంది, సామీ, మీరు కూడా మానందుడి మాదిరే అవుతుండారు !

విశ్వ :—నందునివలె నయిన అంతకన్న భాగ్య మేమున్నది ! తల్లీ అన్నపూర్ణాదేవీ,

తెలుపఁగలేదె స్వప్నమున "ధీరతఁ జేరుము నీదువాసముల్
దెలుపఁగలాఁడు వేఱొకఁడు తెల్లముగాఁ గలిముక్తిమార్గ
ముల్,
వెలలు" మటం; చొనర్చితిని పీసరపుచ్ఛక నీదువాక్కు ; వే
సలుపు వరప్రదానమును. శౌరిసహోదరి, సార్థకమ్ముగా. 6.

కుప్ప :—ఇదేందో అర్దంకాని గోల. అచ్చంగా మానందునితోడే ! అక్కడ యింట్లో యీాయాల యేం యిసేసకమో ! (నలువైపులఁ జూచి) ఓరక్కడ ? శిన్ని ! నీవా ! రామ్మా, ఎవరు లేదులే, మన య్యోరు నటరాజయ్యగారికొడుకు. ఒంటిగా యీసీకట్లో ఒచ్చినావేంటమ్మా ?

[అంతట చిన్నమ్మ ప్రవేశించును.]

చిన్నమ్మ :—ఏం లేదన్నా. మాఁవకి మళ్లా అవుపించింది. కానా తీవరంగా ఉంది. "నాసైదో డొచ్చాడు. దన్నణ్ణైనా" నంటూ కేకేసి పడిపోయినాడు. (గద్గదముగా) మళ్లీ మనలోకానికి ఒచ్చేటట్టులేదే. ఏమవుతుందో అన్నా! తొందరగా యింటికి రాయే.

సుప్ప :—సామీ, సూచినారుగందా! ఇదే కాబోలు మీరన్న బాగ్గెం. ఎల్తాం. శెలవు.

[సుప్పన్న, చిన్నమ్మ నిష్క్రమింతురు.]

విశ్వ :—ఏమిది! "నాసైదోడు వచ్చినాఁడు!" ఇది నన్నుగుఱించియేనా? ఎఱుఁగముగదా భగవానుని చిత్రలీలలను. జను లెట్టివేలలు? ఒడిలో నున్న రత్నములను దెలియరు; గనియందు రాలను నెమకుచున్నారు. ప్రజ్ఞానపాదు లెట్టి యథార్థదృక్కులు! "గార్హపత్యమునను ముక్తిని పొందనగు" నని గురుదేవుఁడన్నమాట ప్రత్యక్షానుభవమునకు వచ్చినదిగదా! ఇంటికిఁబోయి తరువాత నీయుదంతమును తరుతునుగాక. (పరిక్రమించి) ఎవరు వారు?

[ఒకచేతఁ గఱ్ఱ, ఇంకొకచేత చెంబు, చెవికి జందెముగా నటరాజభట్టరు ప్రవేశించును.]

నట :—ఎవరండీ? ఏయూరు?

విశ్వ :—(స్వగ) ఎవరు? నాయనగారేనా? (ప్రకా) నాయనగారూ,

[నటరా జులికిపడును. కఱ్ఱ చెంబు క్రిందఁబడిపోవును. వణఁకుచు విశ్వనాథునిదగ్గఱకు వచ్చి తేఱిపాఱఁజూచును.]

నట :—(గద్గదకంఠముతో) నాతండ్రీ! విశ్వనాథా! నీవేనా నాయనా? (బిగ్గఁ గవుంగిలించి) నీవేనా! నీవేనా! నాయనా, నమ్మఁజాలకున్నాను. మరల ఈపాపిష్ఠునికడకు వచ్చితివా! తండ్రీ, ఆనాఁడు, చదువురానికొడుకుముఖముఁ జూడనన్న ఒకమాటకే అదృశ్యమైతివిగదరా. తండ్రీ మరల నామీఁద దయగల్గినదా! ఏమి సుదినము! ఎక్కడికిఁ బోయినాఁడవయ్యా? ఏమి కష్టములు పడితివన్నా? చెప్పకయే పోయితివే నాయనా!

విశ్వ:—తర్వాత వివరించెదను. కాశికిఁ బోయి విద్యల నేర్చివచ్చితిని. ఆనాఁటితమయాగ్రహమే నా కనుగ్రహమైనది. తలఁపనితలంపుగా నమ్మగారికి సంతోషము గల్గింతము రండు.

నట :—(ఏడ్చుచు) ఇంకెక్కడి అమ్మరా నాయనా.

విశ్వ:—ఏమి! ఏమి!

నట :—ఈలోకముననే లేదోయి. నీ వగపడకపోయిన తర్వాత నిన్నే తలంచుచు నీదుఃఖముచేతనే ఏఁడేండ్లక్రిందటనే తరలిపోయినది. మరల నిన్నుఁ జూచు భాగ్యము దానికి లేదోయి. ప్రభూ! నటరాజమూర్తీ! ఏమయ్యా నీలీల!

విశ్వ :—(స్వగ) ఏమిపరిణామము! అమ్మా, అమ్మా, పోయితివా! నిన్నుఁ జూచుటకై పరువులువాఱితినే! అమ్మా.

బాల్యచాపలమునఁ బరువువాఱితి వీడి;
సర్వ మెఱిఁగి నీవు చనఁగ నేల?
మఱచి తమ్మ నీదు మమకారమును, ప్రేమ
మఱవర్గాదొ నాదుచరితదోసఁగు.

నట :—రారా, నాయనా, పాడువడిన మనకొంపను జూతువుగాని. రా. ఇంటిలో దీపము వెట్టు దిక్కైనలేక యొండిబ్రతుకు బ్రతుకుచున్నాను.

విశ్వ :—(స్వగ) ఏ మున్నది దానిలోఁ జూచుటకు ? అమ్మా, అమ్మా, నాదుండగమునకు నీకా ఈవిపరీతఫలము లభించుట. ఏమి ! ఏమి! నాకును హృదయదౌర్బల్యము గలుగుచున్నది! గురుదేవా, రక్షింపుము. న న్నుద్ధరింపుము. ఈస్నేహతంతువును ఛేదింపుము.

"కా తే కాన్తా ? క స్తే పుత్త్రః? సంసారోఽ యమతీవ విచిత్రః, కస్య త్వం ? కః ? కుత ఆయాతః ? త త్త్వం చి న్తయ యదిదం భ్రాతః."

(అని చదివి) మాయ యెంత పటిష్ఠము !

నట :—నాయనా, విచారింపకుము. విచారించి ఏమిలాభము ? ఇది మన నుదుట వ్రాసియుండఁగా వే ఱగునా ? రమ్ము. పోవుదము.

విశ్వ :—అట్లే, నాయనగారూ.

నట :—(పరిక్రమించి) ఏకపుత్త్రుఁడు ! వానిచేతిలో పోవుభాగ్యము దానికి లేకపోయెనే ! స్వామీ, నటరాజప్రభూ, ఎవనికై పరితపించుచు ఆపుణ్యవతి తరలినదో వాఁడే వచ్చి దానికై పరితపింపవలసినగతి నేర్పఱచితివే ! నీ సంకల్ప మిట్లుండఁగా వేఱొకటి యెట్లు జరుగునయ్యా ! రా, నాయనా, పోవుదము.

[ఇరువురు నిష్క్రమింతురు.]

---

శ్రీ

# నందనారు చరితము

## ద్వితీయాంకము

స్థలము:— గ్రామదేవతగుడిముందు బయలు.

[మాలలు దాసరి ప్రవేశింతురు.]

దాసరి:—(ఆవేశములో నూఁగుచు) కులవృత్తులంతా గంగలో గలసి పోతుండాయి. బ్యామ్మలు మాలోళ్ళవుతుండారు. మాలోళ్లు బ్యామ్మ లవుతుండారు. మాలోళ్ళవృత్తులు మాదిగోళ్లు, మాదిగోళ్ళవృత్తులు మాలోళ్లు శేత్తుండారు. పెళయం ఒచ్చింది. నేను మగామారినిరో. మిమ్మల్నంతా నాచం శేత్తారో. నన్ను పూజ శేయకుండా బాపనోళ్ల దేవుళ్లని కొలుత్తుండారురో. నందుడి మాటలు యిని నాకు బలు లీకుండా ఉన్నారురో. యిస్పనాదయ్య యిపరీతాలు శేత్తుండాడురో. నన్నిడిశేశారురో. మిమ్ముల నంతా ఊడుస్తానురో. మాదిగపల్లి మశనం శేస్తానురో.

కరుప్పణ్ణ:— అమ్మోరా, తెలక శేశినాము. మామీద దయశెయ్యమ్మా; నీవు శెప్పినట్టే శేత్తావమ్మా; బలు లిత్తావమ్మా; ఆమాటనండిరా, మాలయెదవలు.

అంద:— బలు లిత్తావమ్మా.

కరు:— నందుడిమాటలు యినవమ్మా. బాపనోళ్ల దేవుళ్లని కొలవ్వామ్మా. యిస్పనాదయ్యని యిపరీతాలు శేయనీయవమ్మా.

అంద:— (ఆమాటలే పలుకుదురు.)

కరు:—

నీకు సెవేద్దా లిత్తాము మాయమ్మా
,, బలులెన్నొ యిత్తాము మాయమ్మా
,, యేటపో తేత్తాము మాయమ్మా
,, నూరుకో ళ్లిత్తాము మాయమ్మా
మమ్ము రచ్చించి ఒదిలిపో మాయమ్మా

అంద:—కరుప్పణ్ణ శెప్పినట్టే శేస్తాము. అమ్మో మమ్మల్ని రచ్చించవమ్మో.
(మ్రొక్కుదురు.)

దాస:—అట్టయితే ఒదిలిపోతుండా. (క్రిందఁబడును.)

[కొందఱు దాసరిని లోనికిఁ గొంపోవుదురు.]

కరు:—ఒరే, మరిడమ్మ శెప్పినమాట యిన్నారుగందా. మన మేమి శెయ్యాల? నందుడికుటుంబగమే తాతలనాట్నుంచి కులపెద్దలు గదా అని అనుకుంటే ఆడు శెడిపోయినాడు. మన మింకోణ్ణి కులపెద్దని శేశికొందామా? యేఁవంటావు కుట్టన్నా.

కుట్ట:—మళ్ళీ యింకోమాటు నందుడితో శెప్పి సూతాము కరుప్పణ్ణా.

కరు:—ఎన్నిమారులు శెప్పినాముఁరా. యేం లాబ మొచ్చింది? అబాప నయ్యోరిని ఒదిత్తే నేమో. నందన్న బాగుపడేది.

ఇరులను:—అవునురా. అయినా కుప్పణ్ణే శెప్పాలె, ఏం జేయాలసింది.

కరు:—నంగు డేమో మంచోడే! కాని కులంకట్టు తప్పి శెడిపోతుండాడు. అందుకనే మన కాడు పనికిరాకపోవటం. ఏం కుప్పణ్ణా, నీయల్లుణ్ణి ఆఅయ్యోరిని ఒదిలేటట్టు శేశి చివపూజ మానిపించి బాగు శేసు కొంటావా? మమ్మల్ని యింకోణ్ణి కులం పెద్ద శేసుకోమంటావ?

కుప్ప:— నే నేం శెప్పగలనొరే. నామాట నందన్న యింటాడు గనక నా; అణ్ణి తిట్టి కొట్టి కులంకట్టులోకి లాక్కొ_ద్దామంటే మ్యాశిన్ని అడ్డుపడుతుంది. మీాయిట్ట మెచ్చినట్టు శేశికోండి. ఇన్నాలూ నంగుణ్ణి పట్టుకు యేలాడాను. నామాట యినని నిర్భాగ్గుడు. వాడిట్టం, మీాయిట్టం. ఎంతని మునలోణ్ణే శ్చేది.! (వినుట నభినయించి) అదుగో మాయెట్టోడు ఒత్తుండాడు, 'చివచివాం' టూ, మీారే మాట్లాడండోయి.

[అరమూంతకనులతో, చేతులతో తాళము వేయుచు, భావ వేగమున నృత్యము సేయుచు నందుఁడు ప్రవేశించును.]

నంద:—స్వామీా, నటరాజా, ఎందులకయ్యా మా కగపడవు? లోక మందు పాప మున్నదనియా స్వామీా? మే మేమెఱుఁగుదుము? నీ వొనర్చినదిగదా యీాప్రపంచము? ఈ కార్యము నీకుఁ దగునా?

'దోషయుత' మని నీసృష్టి దూఱు టేల?
నీవ కర్తవు, భర్తవు; నీకె శక్య
మయ్య, నీచేఁత మేలుగా మార్పుసేయఁ.
దామసం బేల? కరుణింపఁ దంఁడ్రి రమ్ము. 8

కుప్ప:—నందన్నా యేమంటుండావురా?

నంద:—స్వామీా, నీవున్న కొండపైకి మేమెట్లు రాఁగలము? అణువు నందును, నీ వుందువఁటగదా. ప్రత్యక్షము కాఁగూడదా?

కరు.—(నందునిఁ బట్టుకొని ఊఁచి) ఒరేయి నందా, యాడుండావురో? యేలోకానికి బోయినావురో?

నందు:—(నిశ్చేష్టుఁడై కొంతకాలమునకు ప్రకృతిని పొంది) ఏమి, కరుప్పణ్ణా, యేమి?

కరు:—వచ్చేవా మాలోకి? మేమంతా కలిసిమాట్లాడుకోని నీకు శెప్పాలె ననుకొన్నాము. నీపీ యెట్టియెదవన్న శేష్టలు, ఒదలతావా ఒదలవా?

నందు:—(చుట్టును పరికించి) కరుప్పణ్ణా, ఇదియంతయు నేమి? ఈకోళ్లేమి? వేఁటపోతు లేమి? మరల బలులు మొదలుపెట్టి నారఁటరా?

ఇరు:—పోరే. నీయెంర్రి యిన్నాము గాబట్టే మరిడమ్మకు కోపమొచ్చి పల్లెనంతా ఊడ్చేశింది! ఇకమీద నీమాటే యినము పోరా. దాసరయ్యా శెప్పినాడులే.

నందు:—మనవంటి జీవములనే నఱికిన, ఏదేవునికి దయగల్గునురా? ఇవియు దేవునిబిడ్డలేగదఁటరా.

ఇరు:—చాల్లే. నీవు మాఁవసం తినకుండా, కలుదాగకుండా, పెళ్ళాం మొగము సూడకుండా గొప్పోడివై నావులే!

కుట్ట:— ఒరే, అనుకున్నమాట శెప్పండిరా.

ఇరు:—ఒరే నందా, మీమామ నడిగినాము, నిన్నడగ మన్నాడు. ఇది వరకు పెద్దోడు గందా అని అతడిమొగం సూశి వూరుకున్నాము. ఇకమీద అట్లా వూరుకుండేదిలేదు.

కరు:—ఈ వెట్టిగొదిలి కులకట్లకు లోగిఉంటావా? మమ్మల్ని వే? కులపెద్ద ల్నేర్పాటు శేశికోమన్నావా?

ఇరు:—ఆబాపనయ్యోర్ని ఈపల్లి తొక్కకుండా శెయ్యాలి. మరిడమ యిందాక కోరినట్లు బలులిచ్చి కల్లుకుండలు నెవేద్ద మిచ్చి యే పోతెయ్యాలి. (లోపల వేఁటపోతు మరణధ్వని

నంద:—శివశివశివా! స్వామీ, పరమదయాళూ, ఈవజ్రహృదయముల ఛేత్తవఁబుపఁ జాలవా? నీకరుణామృతవృష్టిచే వీరిహృదయ తే

ముల భక్తిబీజములు మొలక లెత్తింపలేవా? నీవు సంకల్పించిన
అడ్డేమి స్వామీ? నీబిడ్డలయార్తిం బాప నీవుగాక కెవ్వరయ్యా?
ఈయజ్ఞతం దొలంప నీవుగాక సమర్థు లెవ్వరు?

తెలియమి యే మహాఘమొ? హృదిక్ స్థిరుని న్నెఱుగంగఁజాలిరే
వలనను యోగిపుంగవులు, వాంఛిలనేర్తురె దాని వీరలుఁ.
"గలితమహాతమస్కు"లని ఖండనముల్ బొనరింతె దీనులన్
వల దిటు సేఁత, దేవర, కృపన్ మముఁజూడుము చంద్రశేఖరా 9

(అని నిష్క్రమించును)

కరు:—సూశావు, కుప్పణ్ణా, బనులు శెప్పకుండా పోయినాడు.
ఇక లాబం లేదురా. నీవే యింక మా పెద్దగా నుండాలె.

కుప్ప:—నాకొద్దురా పెత్తనం. ముసలోణ్ణి, ఒదిలెయ్యండి. నీవే
వుండు కరుప్పణ్ణా.

కరు:—నా కొద్దురా.

ఇరు:—బాపనయ్యో రొదిలితే బాగుండును. అప్పటికైనా నందన్న మన
దారిలో బడతాడేమో!

కుట్ట:—మనమంతా పోయి పెద్దయ్యోరుతో శెప్పకుందామా?

ఇరు:—అవునురా. అట్టశేస్తే ఆయన నాలుగు తన్నిస్తాడు. యీడికి ఈ
యెట్టి గుదిరి బుద్దొస్తుంది. కుప్పణ్ణ చేతగానోడు గామట్టి—

కుట్ట:—ఆయ్యోరి శేవకు ముందా, యెనకనా, పోవడం?

కుప్ప:—మద్దాన్నం అయ్యోరు బోంచేసి పడుకుంటాడు. మనము పొద్దు
దిరిగి ఒకటిరెండు గడియలకి బోతిమా, ఆయన పురాణము
యినేదానికిముందు మనమాట ల్నింటాడు. శిన్నయ్యోరి కేమైనా
బుద్ది శెప్తాడు, పోదాము రాండిరా ముందు అయ్యోరిదగ్గిరికి.

[అందఱు నిష్క్రమింతురు.]

శ్రీ

# నందనారుచరితము

## తృతీయాంకము

స్థలము : నటరాజభట్టరు నిల్లు.

[ముందు వసారాలో మంచముపైఁ గూర్చుండి తాంబూలచర్వణము సేయుచు నటరాజభట్టరు ప్రవేశించును.]

నట:—ఏకపుత్త్రుఁ డధిగతశాస్త్రచయుఁడై యుండుటకు సంతసింపనా, శిష్టానుగతసంప్రదాయవిరోధియై యుండుటకు, దుఃఖింపనా? వచ్చి ఇరువదిదినములు గాలేదు, చుట్టునుండు గ్రామములవా రందఱును వానిని దర్శించి పొండితిని గీర్తించిపోవుచున్నారు! "స్త్రీలేనియిల్లు తామరలేని కొలను, శోభాకరము గాదు" అని నేనెంత చెప్పినను వినఁడు. బయటికి వెన్నెల, లోన తమము గల చంద్రునివంటిదా వీనిబోధ? ఏమి చేయుదును? ఆహా, వీని తల్లియే యుండిన.......

సుతచయిముగ్ధభావసుధఁ జొక్కొనఁగూర్చును; దాల్మినూఢ్చుశో
కతమము మోముచందురుని క్రమపువెల్గులఁ జీల్చుఁ;
జెయ్యులా
బత్రిమతి డక్కఁగైకొనుఁ; దపంబుఫలంబని మెప్పునొందు; నా
సతి యిలుశోభ నిల్పదె? విసంబిలయాఁ గలవాణి లేనిచోన్. 10

(మాలలు ప్రవేశింతురు)

మాల:—సామీ, దండము.

నట:—ఏమిరా, అందఱు గుమిగూడి వచ్చినారు? కుప్పణ్ణా, ఏమిరా విశేషము?

కుప్ప:—మ రేమిలేదు, దేవరా. మానందుణ్ణి గురించే.

నట:—తెలిసినదే. క్రొత్త యేమిరా?

కరు:—సామికి తెలియకుంటదా, దేవరా.

నట:— ఉన్నదేమో చెప్పరాదఁటరా.

కరు:—సామికి కోప మొత్తుందేమో అని బయము.

నట:—నా కెందులకురా కోపము?

ఇరు:—నందన్న యీమధ్య మరీపిచ్చిలో బడుతుండాడు. మునుపు పగలే ఆడిపిచ్చి. ఇరవయిరోజుల్నుంచి రాత్తుల్లుగూడా ఆడిబజనలే. ఆణ్ణి కాపు శేయడం మరీ కష్టమయిపోయింది.

నట:—నాకు కోపము వచ్చుటకు దీనికి సంబంధ మేమిరా?

కుట్ట:—ఈమధ్య ఆడితోపాటు ఇంకోమనిషికూడ కూడుకున్నాడు.

నట:—ఎవరు?

కరు:—అబద్ధమైతే మన్నించాల పబువులు. మరి... రాత్రులు... ఇంటిలోనే... ఉంటాడా శిన్నయ్యోరు?

నట:—ఆ! ఆ! ఏమీ! ఏమన్నారు? అబద్ధము గూయుచున్నారా! లేక నిజముగా మా విశ్వనాథుఁడేనా? అబద్ధ మాయెనా......

ఇరు:—కళ్లనూశింది నిజమైతే సత్తెప్పమానికంగా శిన్నయ్యోరే, దేవరా ఏమిరా కుట్టా, ముంగిలాగ వూరుకుంటావేమి?

కుట్టు:—నిజం దేవరా. పగలు మాచిన్ని, రాత్రులు నేను మామాఁవకి కాపు కాస్తుండాము. రాత్రంతా మామావ చివాలయ మెదురు గుండే పెద్దసింత, దానికింద గంతు లేస్తాడు. పదిదినాలక్రింద చిన్నయ్యొర్రొచ్చి మాఁవకి మొక్కి యేంశేంటో అన్నాడు. మాఁవతో గలిసి గంతు లేశాడు. "ఇదేంటి దేవరా" అని నానంటా. "కుట్టా, నీ కేం దెలుసు - నందన్న గొప్పబత్తుడు. మాకంతా గురువయ్యేవోడు" అనన్నాడు. నాను బయపడి మా అన్నకి శెప్పినా. మాఅన్నావోళ్లంతా ఒచ్చి నూశారుగాని పెద్దోళ్ల సంగతి మన కెందుకని ఊరుకున్నారు.

ఇరు:—మొన్న జాతరలో మరిడమ్మ దాసరయ్య కావేసంపూని సాములు మాలోడకు రావటంశేతనే పెద్దమ్మోరు గొట్టాలమ్మ పల్లిలో కొచ్చిందని శెప్పింది.

కరు:—సామికి శెప్పకపోతే మరికాదని ఒచ్చాము దేవరా.

ఇరు:—ఇక సామి శిత్తము. ఏమి శేయమంటే అది శేత్తాము.

నట:—(నిట్టూర్పు విడిచి) ఓరీ, నేను కనుఁగొందును లెండు. ఇఁకమీఁద మావాఁడు మీవాడలోనికి రాకుండ చేయుభారము నాది. మీరు పొండి [మాలలు నిష్క్రమింతురు.] ఓరీ కుప్పన్నా, ఒకమాట [కుప్పన్న తిరిగి వచ్చును.] మీరు పొండి....కుప్పణ్ణా,నీవు మంచి వాఁడవు. నిజమే పలుకువాఁడవు. చెప్పు. నిజముగ విశ్వనాథుఁడు మీవాడకు వచ్చినాఁడా?

కుప్ప:—ఏం శెప్పేది దేవరా? నిజమే. చిన్నసామి అద్దరాతిరియేల అక్కడికొచ్చి తెల్లవారుజాముదాక బజనజేస్తాడు. తర్వాత కోనేటిలో తానం శేశి కోవెలలోకి బోతాడు.

నట:—సిరి, సరి. పొలము ఎటు లున్నదిరా?

కుప్ప:—పైరు సాల బాగుంది సామీ. పుట్టిబుద్దెరిగాక యింత పైరు నాను సూడలేదు.

నట:—మంచిపంట పండిన పాలేరుల కందఱికి బహుమాన మిచ్చెదను. సరి. నీవుపో. నందు నొకమా ఱిక్కడికి రమ్మను.

కుప్ప:—సిత్తం దేవరా. [అని నిష్క్రమించును.]

నట:—ఇది యొకటి, ఊరిసిన పుండుపై నుప్పుగారము. ఈనిర్భాగ్యున కీదుర్గుణ మెట్లు కల్గినది? మాలవాఁడు వీనికి గురువా! గాఁడసంప్ర దాయము కొంబోలు. ఆహా! ఆహా! వాదమున గెలిచి యొప్పింప లేను. కోపించిన మరల ఏదేశ మేఁగునో? స్వామీ,శివకామేశ్వరా, నీవును గొడుకులు గలరే. ఈపరీక్షలు మా కెందుకయ్యా కల్పింతువు?

స్వయము మహాపండితుఁ డయ్యును శ్రుతిస్మృతిసదాచారగర్హ్యముగా నీచండాలసంసర్గదోషమునకుఁ బాల్పడుచున్నాఁడే! కొలగతి నేమనుకొందును?

ఈవిషయము తెలిసిన నీయగ్రహారమున మరల తలయెత్తుకొని తిరుగుట యెట్లు? పూర్వజన్మమున నేదోష మొనర్చితినో సహచారిణి నన్ను వీడి దివంగతయైనది. మృతుఁ డనుకొన్న సుతుఁడు లభించెనను సంతసము లేక వీఁడిట్టివాఁడు కావలయునా? అది యుండిన...

(కన్నుల నీరు నించును.)

[విశ్వనాథుఁడు ప్రవేశించును.]

విశ్వ:—(చూచి స్వగతము) ఏ మిది, నాయనగారు కన్నీరు నించుచున్నారు! నేను వివాహమును నిరాకరించుటకేనా? ఏవి భ్రాంతి! ఎంతచదివినను సంసారమోహము జీవులను వీడదుగదా పోయి ఊరడింతునుగాక (దగ్గఱకు పోయి) ఇదేమి నాయ గారూ, ఇట్లున్నారు.

నట:—(విశ్వనాథునివంక నే కొంతవడి తెప్పవాల్పకచూచి) ఏమియు లేదు. ఎక్కడికిఁ బోయితివి ?

విశ్వ:—పరాశరభట్టరు ఒకవాక్యము సమన్వయింప కబురంపఁగా వారి యింటికిఁ బోయి వచ్చుచున్నాను. (పరికించి) పురాణకాలక్షేప కాలమైనను ఎవరును రాలేదేమి ? చాపలఁ దెచ్చెదను. (స్వగ) ఎట్టి వత్సలుఁడు మా నాయన. [నిష్క్రమించును.]

నట:—ఏమిచేయుదును ? ఆనందుని జేరక, వివాహమునకు సమ్మతించి యుండినచో...   [నిట్టూర్పు విడుచును.]

నందు:—[ప్రవేశించి] దేవరా, దండము. రమ్మన్నారఁట.

నట:—(వానినే పరికించి) ఏమిరా, ఇంత కృశించితివి. కనఁబడుటే లేదేమి ! (స్వగ) వీనిని జూడఁగనే నాకోపము సగము పోయినది. (ప్రకా) ఏమి, మొన్నజాతరలో గడబిడ చేసినావఁట.

నందు:—స్వామీ, ఏమిచెప్పుదును ? మావారు మూర్ఖులు. దేవునిపేర సకలకలుషకార్యములు చేయుచున్నారు. మొన్న పశువధ, మాంసభక్షణము, మద్యపానము, యథేచ్ఛముగ జరిపినారు. ఇట్టి వారిపై స్వామికిఁ గృప యెన్నఁడు గల్గునో ? ఈయకార్యములు వలదన్న నన్ను పిచ్చివాఁ డందురు.

నట:—రాత్రులందును భజనలు మాననివాని నేమందురు ?

నందు:—(స్వగ) స్వామికి చిన్నయ్యవారిమాట తెలిసినదా యేమి ?

నట:—సరియే. అటనే యుండుము. వారుగో పురాణకాలక్షేపమునకై బ్రాహ్మణులు వచ్చుచున్నారు. అది అయిన తర్వాత నీతో మాటాడెదను.

నందు:—స్వామిచిత్తము.

[విశ్వనాథుఁడు గ్రంథముతోను, చాపలతోను ప్రవేశించి నందుని గాంచి వెఱఁగుపడి, మరల తెలివొందును. బ్రాహ్మణులు ప్రవేశింతురు.]

నట:—స్వాములారా, ఇటు ఇటు (బ్రాహ్మణు లరఁగులపై నాసీను లగుదురు.)

నట్ల:—అన్నా, పరాశరభట్టరూ, ఆరంభింతమా ?

పరా:—అమృత మిత్తుమన్న వల దనువా రుందురా ? అందును చిరంజీవి కంఠ మేమి ? ఆమార్దవము ఆసౌఖ్యము చెప్పనగునా ?

నట:—విశ్వనాథా, ప్రారంభింపుము. పరాశరభట్టరు అర్థము చెప్పుదురులే. ఎంతవఱ కైనది ?

విశ్వ:—చిదంబరమాహాత్మ్యమున వ్యాఘ్రపాద హిరణ్యవర్మ సంవాదము ముగిసినది.

నట:—సరి, కానిమ్ము.

విశ్వ:—

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే.
ఓంకారనిలయం దేవం గజవక్త్రం చతుర్భుజమ్
పిచండిల మిహం వందే సర్వవిఘ్నోపశాంతయే.
యస్మా త్సర్వం సముత్పన్నం చరాచర మిదం జగత్
ఇదం నమో నటేశాయ తస్మై కారుణ్యమూర్తయే.

(సరాగము)

కదాచి జ్జైమినిమునిః కర్మకాండప్రవర్తకః
సామ్నాం సహస్రశాఖానాం పారం దృష్ట్వా మహామతిః

ఆకర్ణ్య వైభవం శ్రీమాన్ స్థాన స్యాస్య మహాద్భుతమ్
శిష్యైస్సహ సమాగమ్య తిల్వారణ్య మిదం మహత్,
(పరాశరభట్టరు అర్థము చెప్పెను.)

నంద:—(స్వగ) ఆహా! స్వామియనుగ్రహము! నన్నోఁటివాని చెవులలో నెట్టి యమృతము పడుచున్నది.

విశ్వ:—

శీతలే శివగంగాయాం స్నాత్వా పాథసి పావనే
దృష్ట్వా చిదంబరం దివ్యం దేవం సంపూజ్య భక్తితః
సామగానప్రియ స్యాస్య శంభో రానందతాండవమ్
అత్యంతపశ్చాద్భాగ స్స న్నద్యా ప్యాలోకతే మునిః.

పరా:—(అర్థము చెప్పి) ఈ క్షేత్రమునకు సాక్షాత్తు జైమినులవారు వచ్చి నందువలననే క్షేత్రమాహాత్మ్యము తెలియుచున్నదిగదా. ఈ క్షేత్రము నొక్కమాఱు చూచిన చాలదా? ఆదేవాలయస్వర్ణ గోపురము చూచి ఆనందించుభాగ్యము ఎవరికో మహానుభావులకుఁ గాని లభించునా? లోపలికిఁబోయి కనకసభయందు ఆసీనుఁడై యున్న యానటరాజమూర్తి దివ్యమంగళవిగ్రహము నొక్కమాఱు చూచినచూపు విషయములపైకి మరలునా! అందులకనియే యేమన్నారు,

సర్వే వసిష్ఠప్రముఖా మునయో నారదాదయః
పరోక్షఫలదాయీని త్యక్త్వా స్థానాని భూతలే
సదా వసన్తి చాక్షుష్యే శంకరానందతాండవే
ముక్తిదే దృష్టిమాత్రేణ స్థానేఽస్మిన్ మునిపుంగవాః.

(అని దాని కర్థము చెప్పి) ఒక్కమా ఱాక్షేత్రమును చూచిన చాలదండీ! ముక్తి కరతలామలకము గదా.

నందు:—స్వామీ, నటరాజప్రభూ, అనాథరక్షకా, ఎక్కడ నున్నావు!
(బ్రాహ్మణులు తెల్లఁబోవుదురు. పరాశరభట్టరు 'నందా' అనఁబోఁగా విశ్వనాథుఁడు వారించును.)

నంద:—

శౌరి విపంచి మీటు, స్వర చాలన సేయఁగఁ దుంబురుండు, నా
న్నారదుఁడే రచింపఁ గథ, నంది మృదంగముఁ బూన, భృంగిసం
చారము లొప్పఁ దాళమున, సాధ్వసయుక్తతఁ జూడ గౌరి, నీ
వారభటిన్ నటించెడి యఘాంతక తాండవ కేళిఁ జూపవే. 11

స్వామీ, పరమాణువుపై నింతయాగ్రహమా?

మానసాకాశతలమున మలయు తమము
మౌళిచంద్రునికాంతిచే మాన్పు తండ్రి.

ఆహా, ఆహా, వాఁడుగో నటరాజమూర్తి. అయ్యో, అయ్యో, అంతలో మాయమైనాఁడు,

ఇరుగడల నొత్తుఘనముల నించుకాంతి
క్షణము కాక చిరమ్ము సంకలిత మౌనె? 12

[మూర్ఛిల్లును.]

(విశ్వనాథుఁడు పరుగునఁబోయి నీరు ముఖమునఁ జల్లి తేర్చును. బ్రాహ్మణు లాశ్చర్యము నటింతురు.)

నందు:—[తేటి నిష్క్రమించును.]

పరా:—ఏమి, చిరంజీవి ఉన్మత్తుఁడైనాఁడు! పోయి మాలవానిని తాఁకినాఁడేమి! ఒకవేళ మూర్ఛిల్లినమాత్రము మాలఁడు తేఱుకొనఁడా? వృథాగా మైలవడియెనే! ఎంత మంచివాఁడైనను ఇట్టి అసంప్రదాయపు నడతలు కూడునా?

విశ్వ:—

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః.

నట:—నిర్భాగ్యుఁడా, నోరుమూసికో. పిన్న పెద్ద లేదా? పెద్దలకు బదులు చెప్పుటయా దిక్కుమాలినవనితలకుఁ దోడు! ఇవన్నియు తెలియకే పరాశరభట్టరు నీకు చెప్పఁబోయినది! మహర్షులవంటివారు, వారు చెప్పినది శిరసావహింపక బదులు! అన్నా, చిన్నవాఁడు. పొరపాటయినది. క్షమింపవలె. ఇఁక, ఈ దినము, సచేలస్నానము, ప్రాయశ్చిత్తము, నూత్నయజ్ఞోపవీతధారణము, సహస్రగాయత్రీ జపము, సాయంకాలమో రాత్రియో అగును. ఈనాఁటి కిఁక పురాణము ఉండదేమో. ఆయాసము కల్గించితిని. తమ రందఱు ఋషితుల్యులు. అనుగ్రహింపవలె (అని మ్రొక్కును).

పరా:—నీవింతగఁ జెప్పవలెనా నాయనా! ఏదో కుఱ్ఱవాఁడు. సరి. ఇఁక, మేము పోయి వత్తుమా?

నట:—కొంచెము ఉండుఁడు. (లోనికిఁబోయి తాంబూలాదులు తెచ్చి యిచ్చును.) సెలవు, సెలవు. [బ్రాహ్మణులు నిష్క్రమింతురు.]

నట:—విశ్వనాథా, ఇటురా, ఇంత యెండలు దెలియని చేఁత లేమి?

విశ్వ:—ఎఱ్ఱనియెండలోఁ దోడిమానవుఁడు మూర్ఛిల్లిపడిపోయినప్పుడు ముఖమున నీరు చల్లుట తప్పా నాయనగారూ?

నట:—ఓరీ, నాకుఁ గోపము తెప్పింపకు. తప్పో, ఒప్పో! నీకొక్కనికే ఉన్నది కాఁబోలు ఈభూతదయ! ఈయపభ్రంశములు తాతల నాఁటినుండి ఈయింట లేవు. నా యూపిరి ఉండఁగా రాఁగూడదు. తెలిసినదా! చదివి వచ్చితివని సంతసించితినిగదరా నిర్భాగ్యుఁడా! నీచదు వేయేటఁ గలిపివచ్చితివిరా? మాలకుంకపై

నీ క్షేమంతదయ ? నీచుఁడా, ఎంతని యోర్చుట. నీ కొకమా
గురువా ? రాత్రులు మాకన్నులు గప్పి వానితోఁగూడ సెగు
బోవుచున్నావఁటరా ? బంగారువంటి మావంశమునకు మచ్చ దె
వఁటరా ? ఏదో మనకడుపు చింపుకొన్న మనకాళ్లమీఁదనేగ
పడును అని యోర్చుకొనియున్న అందఱియెదుట పట్టపగలే
దిక్కుమాలినసడత లారంభించితివా! పైఁగ వేదాంతమా!
మాఱు నీవు వానితోఁ గలసినాఁడన్నమాట నాచెవిఁ బడ
తర్వాత నీపాట్లు చూడు. అనాచారపు దరిద్రుఁడా, పో లో
పో. [ఇరువురు నిష్క్రమింతుర

శ్రీ

# నందనారు చరితము

## చతుర్థాంకము

స్థలకము I:—శివాలయపురోభాగము - అర్ధరాత్రము.

[అంతట నందుఁడు ప్రవేశించును.]

నందు:—ఏమి యింకను చిన్నస్వామి రాలేదు? పెద్దస్వామి వలదని యుండునా? ఈశా, జగదీశా, నిరంతరసంతోషదాయక మగు నీసంకీర్తనకేని నోఁచుకొనమైతిమా? నాకు సహచరు నొక్కనిఁ బ్రసాదించియు, క్షణముననే యథాపూర్వము ఒంటరిం జేయుదువా? తండ్రీ, పరమపురుషా.

మునుము న్నొంటి రమింపలేక సృజనన్
బూనంగలే దయ్యె? యే
మును ని న్బొంట్లమ కామె? యీవె సహజ
మ్మున్ ద్వంద్వపుంభావ; మే
మన నీవే యొసఁగన్ దొలంప; నిటులే
లన్యాయముం జేయ ? నొ
క్కని నీయన్ ఘనమానొకో సహచరుం;
గైమోడ్తు, నన్ బ్రోవవే. 13

(పరికించి) తెలతెలవాఱుచున్నది. స్వామీ, ఈ యఘూనుభ నాటకమున నింకొకయంకము నాడించెదవా? కానిమ్ము.

ఈసంజ నీమహిమ మేగదా వెలార్చును.

మేకొను నీదునూరుపుల మెల్లని చల్లని కమ్మతెమ్మెరల్;
పైకొను నేత్రరక్తిమచు బ్రాచిఁ దలిర్చెడి రాగరేఖ; లా
లోకనసౌమ్యమూర్తి రవి లోచనమాత్రుఁడ; సర్వలోకమో
హాకుహనాకిరాతక, త్వదుజ్జ్వలతేజము దాఁచు తీరెకా. 1

[విశ్వనాథుఁడు ప్రవేశించును]

విశ్వ:—[దుఃఖముతో] నందా, నందా,

నంద:—స్వామీ, మీరా, ఏల యిట్లున్నారు?

విశ్వ:—నాయనగారు నన్నిఁక నీతో భజన సేయ వల దన్నారు.

నంద:—అందురుగాక, స్వామీ, దాని కేల యింత యాయాసము?

కనరో, స్వామి, సదాగుహాంతరమునన్ గల్యాణుఁగాలాత్మకున్
వినరో సేవల నాథుమందవచసుల్ ప్రేమామృతస్వాదువుల్;
ఘనరోమాంచము దాల్పదో తనువు, నేకాంతప్రకారమ్ముగా
గన బాలేందుశిరస్కునిన్ శివుఁ దదంకాసీన శైలాత్మజన్. 1

విశ్వ:—దానికిఁ గాదు. నందా, నీవంటియుత్తముఁ డొకవేళ అధః వర్ణమున నుదయించుఁగాక, నీ యున్నతిని జనులు గ్రహిం లేకున్నారే; కడకు నాయనగారును ఇంతచదివియు ఈమాం యందే యున్నారే యని.

నంద:—స్వామీ, జగదీశుని కృపలేక అందఱికిని తమవంటో లె యథా దృష్టి అలవడునా? దేవుఁడు తానై నిర్మించిన యీమోహ

బంధములఁ ద్రెంచుకొనఁగలరా? స్వామియు మహేశుఁడే తనకేల క్రతీతుఁడు కాఁగలైనా ?

మమత గురూక్తి నొల్లక,
యమర్షమునన్ సతి దేహ మూడ్చఁగా
"శమమును వీడి తేల, ప్రియ,
సారసలోచన" యంచుఁ దూలఁడె ?
ఉమ, గిరిరాజకన్య, తప
మూనినమాత్ర సహింపలేక తా
నమలిన యోగి యయ్యును
స్వయమ్ము గొనండె గృహస్థభావముల్. 16

విశ్వ:— నాయనగారి మనస్సెప్పుడు మాఱునో కదా.

నందు:—ఎపుడా సర్వేశ్వరుని కీయజ్ఞానమును ధ్వంస మొనర్ప తలంపుదయించునో అపుడు. కేవలము తపించినమాత్రమున భక్తి జ్ఞానము లుదయింపవు. ఉత్సాహాసుయూపదేశములనుఁ సాధ సిద్ధికి కాలపరిపాకమును వలయును. అయినను (మంచిసత్సంగమున) తముబోఁటి యుత్తములం గన్న మహానుభావుల హృదయములందు భక్తిబీజం బుండకపోదు. అదె వచ్చుచున్నది, స్వేచ్ఛాకాలము.

వినఁబడుచున్న వీ శ్రవణవీథుల ముక్తిసుధార్ద్రగీతముల్,
కనఁబడుచున్న వా శివుని క్రమపదాబ్జములున్ స్ఫుటంబుగా,
నొనరుచునున్న దా మహిమ నోరువఁజాలని ప్రేమభారమున్,
వనట లిఁకేల, స్వామి యిల బంధము లన్నియు వీడఁగొందు రే. 17

విశ్వ:—అయిన నందా, నిన్నుఁ జూడక నే నెట్లుందును ?

...

నందు:—(చిరునగవుతో)తనకొఱకు సతీదేవి అగ్నిపాలయిన, స్వామియ ఆమెకై పరితపించె నఁట.

విశ్వ:—నందా, నీవేల పొలములవంక రారాదు ? పొలముపనిఁ జూచ నెపమున నే నటకు వత్తునుగదా.

నంద:—స్వామీ, అటులే కానిండు.

విశ్వ:—నందా, నీతోఁగూడ భజన లింకొకమా ఱుండఁబోవు. కడప పర్యాయము నీగీతమున నన్ను నటరాజదేవచరణారవిందానం మత్తుని జేయరాదా.

నందు:—స్వామీ, ఇరువురము కలసియే పాడుదము.

(ఇరువురు భజన సేయుదురు.)

నంద:—ఎల్లరు వచ్చువేళ యయినది. తమరు—

విశ్వ:—వెడలుచున్నాను. పొలముసంగతి మఱచిపోవలదు.

నంద:—అట్లే స్వామీ.

[విశ్వ. నిష్క్రమించును.]

తంత్రీ,

ఏ నెఱుఁగనె ద్వదీయగతి; నే నెటు చూచిన నాకు బంధముఁ
కానఁగనౌ; పరిభ్రమణకారి మనశ్చలవృత్తి; దీననే
మానునె బంధముల్ ?సుఖముమార్గమ దేమొకొ? హీనసేవ:
దీనతఁ గ్రుంగుటల్ బొసఁగ దే ప్రమహాఃపథము క్తిభాగ్యముల్

నీవేల నియమబద్ధమగు నీసీమ నతిక్రమించి ఎల్లయెడల నీగుణా భవప్రవాహమే నిండునటులు చేయవు?స్వర్వస్వతంత్రునికి నీకీబంధ మేఁ

నీయనుగ్రహామృతమున నీస్వల్పపాత్రము నిండినను బంధస్మృతి లింకను మాసిపోకున్న వేల? ఏమో నీచరిత అతిగూఢముగా నున్నది.

ఏమియుఁ దెలియనివాఁడనని నన్నుఁ గోపింపకుము. మహామహులే నీలీలలఁ దెలియలేరఁట.

"నను మన్నించి భవజ్జనంబులకు నానందంబు నిండించు నీ
తనుతాపంబిది నామనంబున కచింత్యంబయ్యె; నీ యుల్లసద్
ఘనవిశ్వాకృతి నెవ్వఁడోపుఁ దెలియన్‌; గైవల్యమై యొప్పు నా
త్మని వేద్యంబగు నీకు వైభవము చందం బెట్టిదో యీశ్వరా."

(భాగవతము)

పొలమున కేఁగెదను గాక (పరిక్రమించును.)

స్థలకము 2: - పొలము.

నంద:— ఇదె పొలముం జేరితిని. మా వా రెవరును ఇంకను రాలేదు. ఇదిగో మంచె. దీనిపై నెక్కెదను. (ఎక్కి) ఒడిసెలయు రాలును ఇందున్నవి. (చేతగ్రహించి) ఓహో! ఎంతలో పొలమునంచుల నీవిహంగములు గుమిగూడినవి! పైరుపై వ్రాలవేమి! రండు. ఇచ్చవచ్చినట్లు భక్షింపుఁడు. సందేహింపకుఁడు. ఏల రాలేదు? చేత నొడిసెలం జూచియా? ఇదె పాఱవైచితిని.

ఓహో, వేషమున నేమి మాహాత్మ్యమో కదా! ఒడిసెల విసరివైవఁగనే పక్షులు భయమువీడి పైరుపై మూఁగినవి. లేక నా యొడలివిభూతిం గాంచి జగజ్జనకతనయునిగా నన్నుగుర్తించినవో! ప్రభూ, సుందరేశ్వరా, త్రిలోకైకమోహనా, భూతిలిప్తసర్వాంగా, రసావేశనర్తనసమ్మోహితమునిబృందా, భూతియం దింత విభూతి యుంచినాఁడవు, నీయం దెంత విభూతి యున్నదో!

అజినధారివయ్యు నైశ్వర్య మిత్తువు;
ఈశుఁడయ్యు బిచ్చ మిచ్చగింతు;

దయిత మేనఁ గొనియు ధ్యానివ యౌదువు ;
ఈ విరుద్ధగుణము లెట్లు లొదవె ? 19

స్ఫటికవర్ణ, సుధార్ద్రప్రసన్ననయన,
మొలకనగవునఁ గళదేఱు మోము గాంచి,
ఈయఁ దలకొన్న శివనైన నిచ్చు తెగువ
నరసి, నామన మొక్కింత యాసపడును. 20

విహంగములారా, తమ్మిదీఱ భక్షింపుఁడు. నేనును ఈప్రపంచాకాశ పథమున విహంగరీతి విహరించుచున్నాను. కాని మీవలె నాకు స్వేచ్ఛాప్రాప్తి లేదుగదా.

మీరో—

రయమునఁ బోయి నాచెలువు రమ్యకళాయుత దేహశోభ నె
ల్లయనుభవించి, మ్రొక్కిడి, లాలనభాగ్యముపొందనేర్తురే
నయమున లేదు, శోకమున నాకొనఁగూఁడద, యెంచు టెట్లు ల
య్యయగజనాథుఁ జూచి నయనార్తిఁ దొలంచు సుఖంపు
మార్గముల్. 21

(కన్నీళ్ళతో) హృదయక్షేత్రమును తల్లిమరణ మను నాఁగలిచే దున్ని త్వదంఘ్రిభక్తిబీజముల నాటితివి. నీకృపామృతవృష్టిచేఁ బోషించితివి. ఫలకాల మెప్పుడు ?

అమ్మా, హిమాచలతనయామణీ, నీవైన నాథుని కీదీనుని యుదంతమును దెల్పి యుల్లముఁ జల్లచేయరాదా ?

(మైమఱచి యుండును.)

[నటరాజభట్టరు ప్రవేశించును.]

నట:—ఏమిది! పాలే రొక్కఁడును లేఁడు! పక్షులు పైరు నంతటిని హరించుచున్నవి! ఇదియే మన్యాయము! మంచెపై నెవఁడో యున్నటు లున్నది. పోయి చూతునుగాక. (పరిక్రమించి) ఒడిసెల క్రిందఁబడియున్నది. మంచెపై నెవఁడు? (చూచి) ఆహా, నందుఁడే! నేఁటికి వీఁడు పైరుఁ గావవచ్చి యున్మత్తుఁడు గావున మేను మఱచియున్నాఁడు. ఎంతని యోర్చుట? వీనియెడల నోర్పుఁ జూపినకొలది మేర మీఱుచున్నాఁడే? (కోపముతో) నందా, నందా, నందా.

నందు:—(లేచి దిగివచ్చి) స్వామీ, ఈవిరహము నోర్వఁజాలకున్నాను. నామనోహరునిదర్శనము లేక ప్రాణములు నిలుచునటుల లేదు. చిదంబరమునకుఁ బోయి ఆ నటరాజపదాబ్జసేవ సేయక నేను జీవించుట కల్ల.

నట:—ఆఁ! తర్వాత!

నందు:—స్నేహితుల కందఱికిని జిదంబరయాత్ర రేపురేపని చెప్పుచు నిన్నినాళ్లు గడపితిని. ఇఁక నోర్వఁజాల. మా తండ్రి నటరాజమూర్తికి నాసేవ లేదను తలంపు నోర్చుటెట్లు? అనుజ్ఞ నిండు.

నట:—ఓరీ నందా.

నందు:—స్వామీ,

నట:—ఈదినము పొలముకా పెవనిదిరా?

నందు:—నాదే.

నట:—పక్షు లన్నియు పైరుపై మూఁగియున్న వేమి? ఏమి చేయుచున్నావు?

నంద:—[మందస్మితముతో.] నాచేత నొడిసెల యుండెను. దానిని జూచి పక్షులు భయపడినవి. తండ్రిసంతానమున నొక్క ప్రాణిని నేను బాధింపనని తెలియదు. నేనేల వీని యాఁకలి నడ్డగించి తండ్రియెడ నపరాధిని గావలయునని యొడిసెల పాఱ వైచితిని. దానికిఁ బక్షు లన్నియు సంతసించినవి. మాతండ్రి నటరాజును సంతసించినాఁడు. వీఁడుగో! తండ్రీ నటరాజా! వచ్చితివా! ఆహా, ఏమి, నవ్వుచున్నావు. నన్నుఁజూచిన నీకు నవ్వా?

నట:—నవ్వా! దుర్మార్గుఁడా! ఏడుపు, నీకు వచ్చు నిదిగో చూడుము. దుష్టుఁడా! నీతాతముల్లె యనుకొంటివా? మాలదొంగ, నీ మొగమునకుఁగూడ నటరాజమూర్తిదర్శనమఁటరా? పైరునంతటిని పక్షులకుఁ బెట్టి చిందులు త్రొక్కుచున్నావా? పాపాత్ముఁడా! (కొట్టును) ఓహో! ఇదేమి? ఒడలియం దేదియో అద్భుతశక్తి తరంగము ప్రవహించుచు నన్ను ముంచివేయుచున్నది. ఓహో! ఏమిది? నే నెక్కడికి పోవుచున్నాను? ఓహో, ఏమి యానందము! ఇదేమి యింద్రజాలమఁటరా! (కొట్టును) ఓహో! ఓహో! ఇదేమి, వీని స్పర్శమాత్రమున సర్వాంగము లిట్లు మోహ వివశము లగుచున్నవి? ఇదేమి యమృతమా! విషమా! దుఃఖమా! ఆనందమా! వీనియం దేమహిమ గలదు? (ఆనందబాష్పములతో) ఇదేమి? కన్నుల నీరు గ్రమ్ముచున్నది. ఓరీ నీమంత్రములు మాయలు నాకడనఁటరా? (కొట్టును.)

నంద:—నటరాజస్వామీ! ఏమి నాభాగ్యము! పార్వతీదేవి యెంతయో శ్రమించి తప మొనర్చినఁ గాని యీయని నీపవిత్రాంగస్పర్శము నాయట్టిదీనున కప్రయత్నముగ నే యొసంగితివా? ఓహో సకలజీవగణములారా, ఈ నందునిభాగ్యమును జూడుఁడు. సకల

లోకైకనాథుని కవుంగిట నే నణఁగిపోయినాఁడను. ఓహో ఆనందము! తండ్రీ, తండ్రీ, నాకు - నాకు - ఇంతయనుగ్రహము ...నీపై......ఏటికి ? (పాదములఁ బట్టబోవుచు మూర్ఛిల్లును).

నట:—(ఒకతన్ను తన్ని) ఇంత పొగరఁటరా నీకు ? నాపై నీకనుగ్రహమా ? మాలవానికి నీకే యింత పొగరైనఁ జదివిన బ్రాహ్మణునికి నాకెంత యుండరాదు ? మూర్ఛిల్లితివా. అట్లే యమపురికిఁ బో. నీవుపోయిన మా నిర్భాగ్యఁ డేమైన బాగుపడునేమో చూచెదను. ఆదరిద్రుని కీదరిద్రుఁడు గురువు! (పరిక్రమించుచు) ఓహో, మాల లందఱు వచ్చుచున్నారు.

[కుప్పణ్ణ, కరుప్పణ్ణ, ఇరులను, కుట్టను, ఇంకను గొందఱు మాలలు ప్రవేశింతురు.]

నట:—దొంగగాడిదలారా, ఎక్కడికిఁ బోయితి రింతసేపు ? పైరును బశువులకుఁ బక్షులకుఁ బెట్టి యేలోకము లేలఁబోయినారు ? ఒడలు దెలియని నందుఁడా దీనికిఁ గాపు ? ఈమా ఱిట్టిది నా కంటి కగపడనిండు, మీవీఁపులు బ్రద్దలు గొట్టించెదను. ఈ దిక్కుమాలిన పిచ్చివాని మూలమున-ప్రొద్దున నే లేచి యెవరిముఖముఁ జూచితినో—మైలపడితిని. [అని కోలఁదిగ వణఁకుచు నిష్క్రమించును.]

ఇరు:— (నటరాజు పోయిన వంక నే చూచి) అయ్యోయ్యరు బలే అయ్యోయ్యరు నో రెరగని పిచ్చిముండాకొడుకునిబట్టి సావగొట్టి మళ్ళా యేంటో యేంటో శెపతాడు.

కుప్ప:—దూర ముండండిరా, గాలి రానీయండి. ఒరేనందా, యాఁవయి నావురా ?

కుట్ట:—అయ్యో, అయ్యో, మామాఁవ నయ్యోయ్యరు సంపేశినా డేంటి ? అన్నా యేమే పానం వుందలే ?

కుప్ప:—ఉండరా. కదలుతుండాడు. ఉండు. ఏడవబోకశీ.

కరు:—మనము ఈబానపాట్లలయ్యోళ్ళకి శాకిరీసేయడం; కడుపు గాల్చుకోని, వాననక, యెండనక అడ్డమైనా పనీ శెయ్యడం; మనల నీళ్ళు నీటికి మాటికి సావమోదడం. ప్రక్క ఊళ్లో కాపులు, దంచతావుంటే పడలేక బాపనయ్యోరులు గందా అని యీవూరి కొత్తే ఈళ్ళకిగూడా యీ తెగులు పుట్టితే యెట్టబ్బా! ఒరేయి మాలోళ్లు, కుప్పన్నని కుట్టన్నని నందుడిదగ్గర వుండనీయండి. మీరంతా యిట్రాండి. (మాల లందఱు కరుప్పణ్ణదగ్గఱకు వత్తురు.) ఒరేయి, మనమంతా ఒకతీరు, నందన్న ఒకతీరు గదంట్రా.

అంద:—అవును.

కరు:—నోరు మెదపని నందన్ననే ఈబాపనాయన ఈయాళ సావ మోదితే రేపు మనల్ని యింతే గందా.

అంద:—అవును.

కరు:—మనల్ని సూచి ఆఅయ్యోరు నందన్న నొదిలిపెట్టిండు గాని లేక పోతే సంపెయ్యడాని కేమయినా సందేగ ముండేదా?

అంద:—అవునురో అవును.

ఒకడు:—ఇన్నితన్నులు దిని మన మీళ్ళ కెందుకొరే శాకిరీ శెయ్యడం.

ఇంకొకడు :—శాకిరీ శెయ్యకపోతే బువ్వెట్టొత్తుందే అబ్బీ!

మఱొకడు :—ఎట్టోడా, మనకి రాకపోతే యీబాపనోళ్లకిమాత్రం యెట్టొత్తుందే!

ఒక :—ఇంకోవూరినుంచి మనుసుల్ని పిలిపిత్తేనో?

ఇంకొ :—ఎవళ్లొత్తారో రమ్మను. ఒచ్చిరా బండకేసి ఉతకడమే.

కరు :—అడ్డదీ మాట! మరి నన్ను కులపెద్దని శేశినారుగందా? నామా

టందరూ యిని నిలబడతామంటే శెప్తాను. అందరు పెమానికం శేస్తారా?

అంద :— శేస్తాం.

కరు :— అనండి మరి. 'నందుడి సాచ్చిగా యింటాము' అనండి.

అంద :— నందుడి సాచ్చిగా యింటాము.

కరు :— నందుడు శెపితేనేగాని ఈ అయ్యోరి పైరులు గోయకండి. అప్పుడీ ఆయ్యోరు మనకాళ్లు పట్టుకోకపోతే సూత్తాం.

కుప్ప :— ఉండరా, ఉండరా, నందన్న తేరుకుంటూ వుండాడు.

(అందఱు నందుని జుట్టుకొందురు.)

నందు :— (మెల్లగా లేచును. పరధ్యానముగా) నానటరాజమూర్తి యేఁడీ. స్వామీ, పోయితివా, పోయితివా! పాపాత్ముఁడనని నన్ను వదలితివా స్వామీ.

కరు :— ఒరే నందా. సాలదటరా మీ నటరాజయ్యోరు నిన్ను దంచింది. దెబ్బలు మోపుగా దగిలినాయంటరా?

నందు :— (ఉలికిపడి స్వగతము) ఏమిది? వీ రందఱు ఇక్కడి కెప్పుడు వచ్చినారు? (ప్రకా) ఏమిరా, మీ రందఱు ఎప్పుడు వచ్చినారు, పెద్దయ్యవా రేరి?

ఇరు :— ఆయనా! నిన్ను సావమోది మమ్మలని జూచి ఒణకతా ఊళ్లో కెల్లాడు.

కరు :— నిన్ను తన్నిండాని కాయన పైరు గోయకూడదనుకున్నాము మే మంతా!

కుప్ప :— అమాట నా నొప్పుకోనురా. తప్పంటే తన్నరా మరి? పైరంతా పచ్చులకి పెటితే,-ఆయనే గాదు-మన మేమయిపోతామురా? ఆయ నంతమోపుగా తన్నడంమాత్రం తప్పేగాని కొత్తదోవలకి బోఁబు కొంపలకి దేకండిగో యెట్టీముండాకొడుకులు!

నందు :—అన్నలారా, పెద్దయ్యవారు నన్నుఁ దని యనే లేదు. ఎవరో వచ్చి నన్నుఁ గౌఁగిలిం వేఱుగా నుండలేదు.

ఇరు :—బలే ఓ.డివిరా నందా, ఆయన నిన్ను కాలి మేమంతా సూత్తే నే !

నందు :—ఒకవేళ తన్నె నే యనుకొందము. ఆబా మీా కేల ?

కరు :—నందన్న యిట్టిపిచ్చోడు గామట్టే ఆయనం

నంద :—కాదు కరుప్పణ్ణా, అట్లన్న నెట్లు ? అది యన్నట్లు అయ్యవారు కారణము లేక తన్ని క్రిందటి క్షామములో నాలుగేండ్ల క్రిందటి కన్నముఁ బెట్టి రక్షించిన దయాళువు కారణ నా ? అన్నిటికన్న హెచ్చు, శివునియాజ్ఞ నా ? మన మేమి పాపము చేసితిమో అను ఒకవేళ కారణము లేక ఆయన తన్నినాఁ డ మంచిమార్గమునకుఁ దెచ్చువిధ మిది కాదు. లెండు. వినలేదా,

ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సేయ వివరింపంగా
నపకారికి నుపకారము
నెప మెన్నక సేయువాఁడు నేర్పరి సుమతీ.

అని. ఇంకను మీాకుఁ జెప్పవలసినది యెంతవొ చెప్పెదను. [అందఱు

శ్రీ

# నందనారు చరితము

## పంచమాంకము

### స్థలము :—నటరాజభట్టరునిల్లు

[విశ్వనాథుఁడు ప్రవేశించును.]

విశ్వ :—గృహమున నుండియే మోక్షసాధనమును నెమకుమని గురుపాదులయాజ్ఞ. ఆయాజ్ఞను పాలించుట దినదినము కష్టతర మగుచున్నది.

తండ్రి శాస్త్రవిదుఁడయ్యును వివేకమంజులుఁడు గాఁడు. నాపైనున్న కోపమును నిన్న మహానుభావుఁ డగు నందునిపై వెడలఁగ్రక్కెనఁట. ఇంకను శాంతించినట్లు కానరాదు. నిన్నటినుండి యెపుడును పరధ్యానమే. పలుమాఱు నన్నుఁ జేరఁబిలిచియు నేమియు లేదని మరలించుచున్నాఁడు. కారణ మేమో ?

నందునిముఖము చూడరాదని నాయనగారియాజ్ఞ. ఏమి సేయుదును ? ఏల ఈ మతిచాంచల్యము ? కానున్నది కాకమానదుగదా ? తితిక్ష లేక ఇంతపరితాపము తగునా ?

(నటరాజభట్టరు ప్రవేశించును.)

నట :—విశ్వనాథా !

విశ్వ :—నాయనగారూ, ఏమి ?

నట :—నీవు......నిన్న......ఏమియు లేదు.

విశ్వ :—దేనినో చెప్పఁబోయినారు.

నట :—ఏమియు లేదు... అయిన నట్లు సేయుట తగనా ?

విశ్వ :—ఎట్లు చేయుట నాయనగారూ ?

నట :—ఊరకుండుము......ఎవరును నామాట వినరు. ఏమి చేయ నగును? యథాపరాధదండన మొనర్పఁగూడదా ?

విశ్వ :—నాయనగారూ, ఏమి, చిత్తస్వాస్థ్యము లేకున్నారే ?

నట :—చిత్తస్వాస్థ్యము దహించుకొనిపోనీ! నీయట్టి కొమరుఁ డుండఁగా నికఁ జిత్తస్వాస్థ్యమున కేమి కొదవ? పదియేండ్లుగ చిత్తస్వాస్థ్యము నే కల్గించుచున్నావు.........నీ వొకటి......

విశ్వ :—నాయనగారూ, ఏమిచేయు మందురు ?

నట :—నీవు...పోయి...

విశ్వ :—(స్వగ) ఏమి ఈ విభ్రాంతి ? నిన్నటివృత్తమునకై కల్గిన పశ్చాత్తాపమా ?

నట :—ఏమిరా, ఇంకను ఇందే యున్నావు ?

విశ్వ :—ఎక్కడికిఁ బోయి రావలయునో చెప్పినారు కారు.

నట :—ఎంత మంగుఁడవురా! పరాశరభట్టరును...నందుని బిలుచుకొని రమ్ము.

విశ్వ :—చిత్తము. [నిష్క్రమించును.

నట :—మనస్సు సరిగ లేదు. నందుశరీరస్పర్శము గల్గినప్పటినుండియు నేదియో తాపము గల్గుచున్నది. మాలవాడకైనఁ బోయి వానిఁ జూడవలయునని యభిలాష జనించుచున్నది. ఈ చిత్తచాంచల్యమునకుఁ గారణ మేమి? అంత్యజశరీరస్పర్శదోషమా

అయిన నందుఁ డితరులయట్టివాఁడు కాఁడే. సద్గుణములు కల వాఁడే! ఉత్తముఁడే! ఉదారుఁడే!

శివశివ, ఏమి యీమాలవాని స్మృతి, నన్ను వదలదా యేమి? ప్రాయశ్చిత్తము చేసికొన్న నీదోషము తొలఁగునేమో? ఈసారి జీవ ప్రాయశ్చిత్తము చేసికొందునుగాక, నే నొనర్చిన సకలపాపములు నిర్ధూతము లగును.

ఈ యనలము నేనే తెచ్చుకొంటిని. కాదు, కాదు, విశ్వనాథుఁ డింటికి వచ్చినప్పటినుండి యీయావేదన ప్రారంభ మైనది. వీఁడు నాదుఃఖమునకే పుట్టిన ట్లున్నది.

[పరాశరభట్టరు ప్రవేశించును.]

పరా:—నాయనా, నటరాజా,

నట:—మీరా! అన్నా, రండు కూర్చుండుఁడు. ఏమి యీయకాలమున గృహమును పావనము చేసినారు?

పరా:—ఇదేమి? నీవే నన్ను రమ్మంటివని విశ్వనాథుఁడు వచ్చి చెప్పి నాఁడే!

నట:—(స్వగ) అన్నానా ఏమి? ఏమో! ఈ గందరగోళమున నేమి జరుగునో. ఈదిన మేమి కానున్నదో! (ప్రకా) అవు నన్నా. మఱచితిని.

పరా:—ఏమి నాయనా, యి ట్లున్నావు. మొగమంతయుఁ దెల్లఁ బాఱినది. మొన్నటి కీనాఁటి కింత భేద మేల కల్గినది? ఏమి కారణము?

నట:—ఏ మున్నది.? మనవిశ్వనాథునివిషయమే.

పరా:—మొన్న జరిగిన దానికా? కుఱ్ఱవాఁడు చదువుకొన్నాఁడుగాః ల్లోకానుభవము కలుగవలయునుగదా.

వట :—కాదన్నా,

కడచె న్నేండ్లును బూండ్లు; నొక్కశుభమా
కార్యంబు లేదింట; ప
న్గడచే నెట్టులొ చూడఁగల్గితిని
నాగారాపుఁబట్టిం; బ్రవీ
ణుఁడు శాస్త్రార్థములందుఁ; బెండ్లియన
వీనుల్ సోఁకరాదయ్యె నా
నుడు ; లేమెంతును ; శోభలేని
గృహమందుక్ నేనిఁ కెట్లుండనా. 22

బలవంతము చేసిన మరల నేదేశ మేఁగునో ?

పరా :—ఇదేమి నాయనా, కన్నీరు నించుచున్నావు. నీవంటివాఁ ట్లధీరుఁ డగుట పాడియా ? కుఱ్ఱవానికి నేను చెప్పి యొప్పి తును లెమ్ము. మహాలక్ష్మిసమానురాలుగదా యమ్మాయి ; ఆవె యున్న వీఁ డీపాట్లు పడునా ? కాల మిట్లు జరుగవలసియున్నది

వట :—(స్వగ) ఇదే మింతచేల నైతిని ? (ప్రకా) ఎవరో వచ్చుచున్న ట్లున్నది. మ ఎవరు ? అన్నా, మనవాఁడును, ఆ మాలజో నందుఁడును.

పరా :—వీరిద్ద ఱొకటైన ట్లున్నది.

వట :— నిన్న వీఁ డెవరో నియమించినట్లు పొలము గావఁబోయి త పిచ్చిలోఁ దాను మునిఁగి పైరును పక్షులకుఁ బెట్టఁగా వలసినం పూజ చేసితిని. మరల నెందులకు వచ్చుచున్నాఁడో! (స్వగ వీనినిగూడ నేను పిలువనంపితినా యేమి ?

[నంద విశ్వనాథులు ప్రవేశింతురు.]

విశ్వ :—నాయనగారూ, తాము చెప్పినట్లు నందుని దీసికొని వచ్చితిని

నందు :—స్వాముల కిద్దఱికి దండములు.

నట :—సుఖీభవ. [పరాశరభట్టరుతో జనాంతికము] మొత్తముమీఁద మంచివాఁడే. మననిర్భాగ్యున కీబుద్ధి పుట్టియుండక పోయిన బాగుగా నుండెడిది. [విశ్వనాథునితో] నీవు లోనికిఁ బో.

[విశ్వనాథుఁడు నిష్క్రమించును.]

పరా :—[జనాం] ఎంత మంచివాఁడైనను మాలవానిని వానియంతస్తు నుంచవలెనుగాని పైయంతస్తున కెక్కింపఁగూడునా. ఒకమాఱు సందిచ్చిన వీరు తలపై కెక్కి కూర్చుండరా!

నందు :—స్వామి యెందులకో నన్నుఁ బిలిపించినారఁట.

నట :—ఏమియు లేదు. నందా, నిన్న, చూడు, అనవసరముగ దెబ్బలు తిన్నావు గదా! మంచివాఁడ వని పేరుగన్న నీవే యిట్లు చేసిన నెట్లు? మీ నాయన యెంత యుత్తముఁడు! నాయొద్ద దాదాపు పదునైదేండ్లు పాలేరుగా నుండినాఁడు. ఒక్కనాఁడైన పల్లెత్తు మాట వాని ననియుంటినా? అట్టివాని కడుపునఁ బుట్టి వృథాగా నేను చేయి చేసికోవలసినట్టిస్థితిని నీవు కల్పింపవచ్చునా? పొలములో రేయింబవలు శ్రమపడుట, పైరును బత్తులకుఁ బెట్టుట కఁటరా!

నంద :—అంతయు స్వామి యనుగ్రహము.

నట :—స్వామి! గీమి! చూచినారా, అన్నా! ఎప్పుడిదే ప్రలాపము. ఆఁ యనిన స్వామి! ఊఁ యనిన స్వామి! ఎవఁడురా ఆస్వామి? దేవుఁడు, ఉన్నాఁడని భక్తితో నుండుట మంచిదే కాని యింత విపరీతము కూడునా? ఏమి, నటరాజమూర్తియైన నేమి? (నందుఁడు నటరాజభట్టరువంకనే స్థిరదృష్టితోఁ జూచును.) త్రిపురాసురసంహారుఁడైన నేమి? కాలకూటవిషభోజనుఁడైన నేమి?

స్ఫటికస్వచ్ఛవర్ణుఁడైన నేమి? (స్వరము క్రమక్రమముగా ఆనంద విశిష్ట మగును) దివ్యసుందరదేహుఁడైన నేమి? ప్రసాదభాసురమందహాసాంచితకటాక్షమాలికావిరాజితుఁడైన నేమి? ఊరకయే నోటిలో ముద్ద వచ్చి పడునటులు చేయునా?

నందు :—స్వామీ, ఏమి చెప్పఁగలను. ఆయనకృప లేక జీవజాలముల కార్యముల నొక్కటియైన జరుగఁగలదా? లాభాపేక్ష యుండుఁగాక, ఆదివ్యవిగ్రహుని ఊరకయైనఁ గొలువవచ్చునే!

చదలివాఁకఁ దేలు చంద్రుఁడు సిగపూవు,
గౌరిబాహువల్లి కనకసరము,
పాదపద్మపీఠి భక్తశిరస్తతి,
అట్టిసొగసు మనసు నాఁచికొనదె? 23

నట :—చూడుఁడన్నా, ఇట్టి శుద్ధభక్తి వీని కెట్లు గల్గెనో? బ్రాహ్మణులయం దెక్కడను గనరాకున్నదే!

పరా :—పూర్వజన్మపుణ్యము.

నట :—శివాలయమునకు నిత్యము పోయి వచ్చుచున్నాము, మనకు లేదు. వీఁడా లింగమును జూచియైన నుండఁడు; వీని కెట్టిభక్తి గలిగెనో యని యాశ్చర్యముగా నున్నది.

పరా :—ఎవరిపిచ్చి వారి కానందము గదా! పోనీ! ఆమాటల కేమి? ఆలయములకుఁ బోకుండిననే మా కింతభక్తి యున్నదే! పోయిన నింకెట్టిభక్తి కల్గునో యని వీరు మనయాలయముపై దండెత్తకున్నారు. అదియే చాలును.

నట :—నంద్గా, నీపిచ్చికి మే మేమి చేయుదుము? అట్లే యుండుము. మాపద్ధతిని మే ముందుము. కాని చేయఁబూనుకొన్న పని

చక్కఁగాఁ జేయుము. అట్లు బుద్ధిమంతుఁడవై మెలంగితివా, నీవు కోరుకోరికలెల్లఁ దీర్చెదను.

నందు :—స్వామీ, ఒక్క మనవి.

నట :—ఏమి నందా.

నంద :—విన్నవించెదను.

కలఁడఁట సహ్యజాజల
విగాహనకౌతుకి చంద్రచూడుఁడే
మలినమనం బడంచి ఘన
మార్గముఁ జూపు చిదంబరమ్మునన్ ;
జెలియఁట యొక్కమా అతని చెల్వము
గన్గొన ముక్తికాంత ; బా
ములఁ దలఁగంగఁ గోరెద.
ముముక్షుని దీను ననుగ్రహింపవే. 24

పురా :—అమ్మో ! వీనికడుపులో పెద్దకోరిక లున్నవే ! చూచి వచ్చెద నన్నాఁడు, మేలే. ఏమి యహంకారమురా నీకు! నీమొగమునకు నటరాజమూర్తిదర్శనమా ! ఆయాలయమునీడనైన నిన్నుఁ ద్రొక్కనిత్తురా ? చిత్సభలోని దివ్యమూర్తి నీకు కనఁబడునా ! ఆ దేవునిముందున్న నందిదర్శనమైననాఁడు చూతములే.

నట :—[జనాం] అన్నా, మన కెందులకు? ప్రత్యక్షముగా మంచికోరికను నిరాకరించినట్టు లుండనేల ? ఉపాయము చేసెదను చూడుఁడు. [ప్రకా] నందా, నీకోరిక ఉత్తమమే. కాని యిది కోఁతలకాలము గదా. దాదాపు ఇన్నూరెకరములపై రున్నది. ఇప్పుడున్న కొలఁదిమందిలోనే దేవతలదర్శనముకు కని యొక్క

దయ్యాలదర్శనము కని యింకొకరు, పోయిన
కుప్పవేసిన తర్వాత నీవు కోరినట్లే చిదంబరము

నంద :—స్వామీ, ధన్యుఁడ నైతిని.

అగజఁ గూడి యాడు నభవుండు, సిరి గ
హరియు, వాణిఁ జేరు నబ్జభవుఁడు,
నెంతదనుక వారు సంతరింతురు జగ
మంతదనుక స్వామియశము నెగడు.

తండ్రీ, నటరాజస్వామీ, నీశిశువు నెట్లు
భారము. [

నట :—పాపము ! మూఢభక్తి గలవాఁడు. నట
నింకొకటి లేదు. మంచిదే. మంచిదే. మఱి,
విశ్వనాథా ? విశ్వనాథా, ఏఁడి ? (లోనికేఁ
అన్నా, యింటిలో లేఁడే ! ఎక్కడికిఁ బోఁ

పరా :—(చూచి) వాఁడుగో శివాలయమువంకకుఁ

నట :—విశ్వనాథా, విశ్వనాథా,

పరా :—పిలు పందదు నాయనా, నేను ఇంకొకమా
నీ వేమియుఁ జింతిల్లకు.

నట :—ఈ కాలపుబాలురవర్తనములు మాకుఁ
మును చిన్నతనమున దేవునిచింతన మెఱుఁ
వెఱ్ఱివేడబము లెఱుఁగమబ్బా! ఏమి రానున్నద

శ్రీ

# నందనారు చరితము

## విష్కంభము

స్థలము : శివాలయపురోభాగమునఁ గోనేటిగట్టు.

[విశ్వనాథుఁడు ప్రవేశించును.]

విశ్వ:— ఈనాఁ డకారణముగ నానంద ముప్పతిల్లుచున్నది. ధ్యానమగ్నునికి నాకుఁ గాలపరిమితియే తెలిసినది కాదు.

ఓహో! భగవానుని సౌమ్యరూపప్రదర్శనము. ఏమి ఈయుదయదిందుశోభ!

యోగమునయందుఁ ద్రిగుణము లొప్పారు కరణి
నభ్రవీథిఁ దమశ్ఛవు లలరె; నంత
రజని యూడ్చిన కరుడైన రజము నాఁగ
శశి వెలిఁగెను; వెన్నెల సత్త్వ మొనరె. 26

అభ్రగంగాలహరి నోలలాడు విధువు
పరమశివునిమౌళి ననార్తవంపుఁబువ్వు;
అతని కరచర్చఁ గరఁగుచు నలరు చుక్క
లైందవామలమణిభూష లంబసిగను. 27

ఇంటికిఁ బోయెదను గాక. నాయనగారు నందుని పిలిపించిన దెందులకో? మనసు మాటి వారును నందపూజాసక్తులైన

అన్నపూర్ణాదేవి యడుగుల కెఱఁగి
యుమనాథుఁ గొల్తు నే నుత్పలమాల;

నిరతిశయానందనిర్ఝరవారి
మలినత వోవఁగా మజ్జన మాడి
భవనియోగానందభర్మశలాకల
భక్తిమై నూఁగుడు భావశూన్యతను ;
భువి యేదో దివి యేదో బోధయే లేక
జ్యోతియం దాలీనశోభ నే నౌదు. 28

(పరిక్రమించి) ఎవ రది? కుట్టా, ఏమట్లు పరుగిడుచున్నావు?

కుట్ట:— [ప్రవేశించి] సామీ, దండాలు. పెద్దయ్యోరు పైరునంతా గోశేస్తే మాఁవ చిదంబరము పోవడాని కొప్పుకొన్నారంట. ఆమాట శెప్పి నందన్న మమ్మల్ని పైరుమీద కెగబడమనేసరికి, సామీ, ఏం శెప్పేది! ఏం జేశామో, ఏ మయిందో తెలవదు. ఆనాడు తిరుపంగూరుకొనేటి నొక దినంలో దవ్వామే, ఆమాది రయింది. ఈ పాటికి కోత, కుప్పేయడం అయిపోయింది. అయ్య వారిని తీసికో రమ్మన్నాడు మాఁవ. ఆయనకాడికి పోతుండా.

విశ్వ:— సరి; పో. [కుట్టన్న నిష్క్రమించును.]

పాదమ్మంతధరిత్రి గర్వితుల సేవన్,
వర్ణవిభ్రాంతులన్
వాదవ్యగ్రతఁగాక ప్రేమసుధసం
ప్లావంబునన్, దేర్పఁగా
నీ దీనుల్ తరియింపఁ, దోఁచెనొ కటా
యీ యంత్యవర్ణమ్మునం
దా దేవుండు జనౌఘరక్షకుఁడు దా
నైశ్వర్యహీనంబుగాన్. 29

ఈ మహానుభావుని సేవయందు నియమించి నాయనగా రెంత పాపమున కొడికట్టుకొన్నారు ?

ఈయఘు మెట్లు పాయునో కో !
యిమ్మహితాత్ముఁడె యింటి బంటి ? దే
వో యిటు వేషధారియయి
మోహము గొల్పఁగఁ జంద్రమౌళికిన్ ?
ఆయతమూఢభావముల
నర్మిలితోన హరించు నేర్పొకో !

ఎట్టులును,

ఈయనఘాత్ము పాదయుగ
మిచ్చుత మాకు మహోదయమ్ములన్. 30

తండ్రీ, నీలకంఠ, ఈ పాపమును గూడ విషముంబోలె నీకంఠమున నే నిల్పుకొమ్ము. తల్లీ, అన్నపూర్ణేశ్వరీ,

వరదానం బొనరించి నన్నిటకుఁ
బంపన్ నీవెకా హేతు; వి
ట్లరుదౌ నీదువరప్రదానమును.
నందాఖ్యన్ విరాజిల్లు త
త్పరమాశ్చర్యవిభూతి పంచమ
కులంబం దప్రకాశంబు గా
నుఱవౌనో కో? కృపావిలాస మొకో?
యొప్పో నీకు సర్వేశ్వరీ! 31

పోయి నందస్వామిని జూచెదను గాక. [నిష్క్రమించును.]

శ్రీ

# నందనారుచరితము

## షష్ఠాంకము

స్థలము:— పొలము

[గట్టుపైఁ గూర్చుండి, మాలలు పరివేష్టించి యుండ, నందుఁడు ప్రవేశించును.]

కుప్ప:— నందా యేమి నాయనా, యిట్లున్నావు?

నంద:—

సర్వజగత్క్రియాభరణసంప్రాతిదక్షుని దాండవక్రియా
పర్వవిముగ్ధదేవమునిపాళిమనోహరనాట్యశీలునిన్
స్వర్వనజేక్షణాప్రణయ సంచలితాత్మవిమూఢ దేవరా
డ్గర్వవిఘాతుకున్, దలఁతు గౌరిమనోవిభుఁ జంద్రశే
ఖరున్, 32

కరు:— అన్నా, నందన్న కడ్డు పోవద్దు. మనకు అర్దం గాం దేదో శెప్తుండాడు. నందన్న దేవుడు గాని మానిసి గాదు. ఎందుకో మనలో బుట్టాడు.

శంకోత్పాటితభావయుక్త మునిసంసద్ధ్యాన సంలక్ష్యమున్,
పంకాపూర్ణరసాజనౌఘ సుఖసంపాదిప్రభాపుంజమున్,
ఓంకారాంగము, హృష్టశైలతనయా ప్రోత్తుంగ వక్షోజ భా
రాంకం బోముత శైవదేహము మమున్ రాగాబ్ధినిర్మగ్నులన్.

ఇరు:— నా కేమో బయ మేత్తుండ దబ్బా. పుట్టి న్నాటినుంచి మన మద్దినే పెరిగిన నందన్న కెక్కడినుంచి ఒచ్చిందో ఈ బాస ?

నంద:—

యోగపథంబునం దనిలయోగము రూపము మాపునాఁడు, నా
వేగము వీడి కుండలిని వేయియరమ్ములచక్రమందు సం
యోగముఁ బొందునాఁడు, శుభయుక్తి; భవుం డురుకాంతిఁ దోఁచు న
ట్లాగమనమ్ము గల్గు శివు నాగమసూక్తులఁ బ్రస్తుతించుటన్. 34

కుప్ప:— ఏడంబ్బా, నందన్నముగం అట్లా యెలిగిపోతుండాది? ఏదో రాబోతుంది. లేకపోతే, మనము సరేగదా, నందన్న మాటలని దేవుడే యింటున్నాడా అనేటట్టు రివ్వుమంటూన్న గాలి సద్దణగి పోయింది. సెట్టు సేమబోవ పచ్చులు గూడా సప్పుడు సేయటం లేదు. అంతా బొమ్మ గీచినట్టుగావుంది. మాటాడబోతే లోగొంతుకే గాని మాట పెగిల్తేనా ?

ఇరులన్:— ఒరేయ్ కరుప్పణ్ణా, చిన్నయ్యోరు రో !

[విశ్వనాథుఁడు ప్రవేశించును.]

విశ్వ:— (శిరమున నంజలి ఘటించి)

అంతరంగనిష్ఠ సూత్రోరుభాసమ్ము
చక్షువులకుఁ దెలిసె; శాంతమహము
నిత్యశుద్ధమైన నిర్మలతేజమ్ము
మోహనాశకమ్ము మ్రొక్కవాఁడ. 35

(నందునికి సాష్టాంగముగ మ్రొక్కును.)

నందు:—(విశ్వనాథునిశిరమునఁ జేయి నునిచి)

ప్రభవించుఁ గాక విమలంపుయోగము; తిరంబౌ నీకు శుద్ధమ్మగు భ
క్తి, భువిఁ గేరుత నీదుకీర్తిరమ : యంతేవాసివర్గమ్ములం
దు భవన్నేతృత భక్తిఁ బెంచి యనఘా, దోషాళిఁ బోఁ
ద్రోచు నో
జ భవుండుం గాక వికలంబు సేయుత భవత్సంసారబంధమ్ములన్. 36

విశ్వ:— ధన్యోస్మి. ఇన్నాళ్లీ విమలతేజఃస్ఫూర్తి నడంచితివేల నంద
స్వామీ, మహానుభావా.

నందు:— వత్సా, విశ్వనాథ,

సర్వజనులు శివుని జంగమరూపంబు
లాత్మకాంతు లందు నలమియున్నఁ
గారణమ్ము లేక కనవు ప్రకాశమ్ము;
నుచితసమయమంద యుబుకు వెలికి. 37

నాతోడివారు ఈ విభుతకు భీతిల్లుచున్నారు, ఇదె దీని నుపసం
హరించితిని. (ప్రకృతిం బొరయును.)

విశ్వ:— (స్వగ) విశ్వరూపప్రదర్శనోపసంహారము లైనవి. తంద్రిగా
రిపు డిందున్న... (నిట్టూర్పు విడుచును.)

నందు:— కుట్టన్న ఇంకను రాలేదా, ఇరులన్.

ఇరు:— వాడుగో పెద్దయ్యోరు పరుగెత్తుకొంటా వస్తున్నాడు.

[నటరాజభట్టరు ప్రవేశించి నందునిపాదములం బట్టుకొనును.
కుట్టను ప్రవేశించును.]

నందు:— స్వామీ, లెండు, లెండు, అపచారము నా కొడిగట్ట నేల?

నట:— నీవు క్షమించెదనన్నఁగాని విడువను. తండ్రీ, నిన్ను పాలేరుగ గ్రహించి మహాపాపానలప్రవిష్టుఁడ నైతిని. నిన్నుఁ బ్రహరించి నరకాగ్నిపరీతుఁడ నైతిని. దైవాంశసంభూతుని నిన్ను సామాన్యునిగా నెంచి యిట్టు లైతిని. అన్నా, నందా, అవివేకముచే నిటు లొనర్చితిఁ గాని వేఱు గాదు. నన్ను క్షమింపుము.

నందు:— స్వామీ, లెండు, ఈ సంసారవిషయముల మునింగినవారికి సర్వము భ్రమయే కదా. అయినను తాము సేవకునెడల నే య రాధ మొనర్చితి మనుచున్నారో అది నే నెఱింగినది కాదు.

నట:— తండ్రీ, నీ విట్టి యుదారుఁడవు, నీవు సాక్షాత్తు శివుఁడవో, కుమారుఁడవో కావలయును. లేదేని, ఈ యమానుషకృత్యము లింకొకరి కొనర్పనగునా! ఇన్నూఱెకరములకోఁత నొకదినమందు నలుగురు చేయుట! ఎన్నఁడైన వింటిమా!

నందు:— భగవానునిలీలలు గాని స్వామీ, నాడే మున్నది?

నట:— ఈ వినయము నీకు వన్నెవెట్టుచున్నది. నిన్నుఁ బొగడుటకు శక్తియైన నెంత కలదు? ఒకటి విన్నవించెదను. నన్ను నీ శిష్యతుల్యునిగఁ గైకొమ్ము.

నందు:— స్వామి ఆమాట ననరాదు. ఆనందమున మొదటివిషయమును మఱచినారు.

నట:— నందా, అది దెలిసియున్న ఈదశ కేల వత్తును?

విశ్వ:— నాయనగారూ, చిదంబరయాత్ర కనుజ్ఞ నడుగుచున్నారు.

నట:— నందా, ఈ స్వల్పమునకు నీవు నన్ను యాచించుటయా? ఇఁక నేను నీ కొడయఁడం గాను, నీవు సేవకుఁడవు గావు. నేనె నీ సేవకుఁడను. నీ యిచ్చవచ్చిన ట్లొనర్పుము.

నందు:— ధన్యుఁడను స్వామీ, ధన్యుఁడను.

నట:—విశ్వనాథా, కొంచె మాఁగుము. నందా, నా కుపదేశ మీయవా?

నందు:— స్వామీ, పంచముఁడను, గురుసేవ సేయని శాస్త్రపరిచయమే లేని నేను తముబోంట్ల కే యుపదేశ మీయఁగలను? అయినను విజ్ఞులకు మీకు చర్వితచర్వణముగాఁ గొంచెము.

సకల మిలను శివుని చరరూపవిభవమ్ము;
భేదభావ మెంచ బిరుదు గాదు;
ప్రేమగల్గుచేతఁ బ్రియవాక్యములచేత
గారవించు టొప్పుఁ గలుషునైన. 38

ఉన్నదానఁ దృప్తి నొందిన విజ్ఞుఁడు
పొందు సుఖము, పొందు పుణ్యచయము;
భక్తిలేనివాని భగవానుఁడైనను
జ్ఞాన మిచ్చి ప్రోచు కరణి గలదె? 39

సెలవిండు.

కుప్ప:— నందన్నా, యీమైనే చిదంబరము బోతావా? ఇంటి కొచ్చి శిన్నమ్మని సూడవా?

నందు:— మామా! శివుని జూడఁబోవువానికి ఇల్లు, వాకిలి, భార్యయు నా?

కుప్ప:— అయితే నందా, మమ్మ ల్నాదిలేత్తా వంటరా? చూడు సామీ, మీ రేఁవన్నారో, నందన్న యిక్కణ్ణుంచే మాట గట్టా వుండాడు.

నట:— నందా, ఉన్నబంధముల హఠాత్తుగఁ ద్రెంపిన నెట్లు? క్రమముగ వీడఁదీసికొన్నఁగదా బంధపరికరములు చెడకుండుట?

నందు:— స్వామీ, బంధము లిన్ని యున్నవా? మనస్సేగదా బంధము లన్నింటికి మూలము!

నట:— సర్వము నెఱింగిన నీకు నేను చెప్పు టేమి? అయినను, ఏమియు నెఱుఁగని యీ చిన్నదానిని నట్టేట వదలిపోవఁ దగునా?

నందు:— స్వామీ, అటు లనుకొనవలదు. నిష్కామచిత్తమున ముగ్ధ ప్రేమతో ఈ జీవుని గొలిచిన చిన్నది హానిం బొరయునా? ఇదె యీబాలకు నా యాశీర్వాదము.

లేశమేని లేదు లేమ కెట్టిదోసంగు;
బేల యెదను నింపె ప్రేమభరము.
చిన్నతనమునందె శివభక్తుఁ గొల్చెను;
కలయుఁ గాక నన్నుఁ గాలమునను. 40

నట:— కుప్పన్నా, నందుఁ డిఁక ఇంటికి రాఁడు. నీవే బిడ్డను చిదంబరమునకుఁ దీసికొని పొమ్ము.

కరు:— నందన్నా, మామాట యేంటే! మమ్మ ల్నెడకు బొమ్మంటావు. (ఏడ్చును.)

నందు:— కరుప్పణ్ణా! దుఃఖ మేల? ఎప్పుడైనను పోయఁగలవారమే కదా? చెప్పవలసినదాని నీవఱకే చెప్పితిని. కడపటిమాట, మాంసభక్షణము సేయక మద్యపానము మానివైచి శుచిగ నుండి సత్యము నే వచించుచు దేవుని నమ్మియుండుఁడు. భగవాను ననుగ్రహము మీ కంతట లభించును.

ఇరు:— ఒరే కుట్టా, ముసలోళ్లి నిక్కణ్ణే ఉణ్ణీరా. మనంమాత్రం నందన్నతో బోవాలె.

నందు:— స్వామీ, కడపటి యాచన.

నట:— ఏమి నాయనా !

నంద:— చిన్నయ్యాను నాతోఁ జిదంబరమువఱకుఁ దీసికొని పోయెదను.

నట:—నందన్నా, నీ కడ్డు చెప్పను. కాని చూడుము. ఈతల నరసినది. ఇల్లాలును లేదు. మరల వాని నిల్లుఁజేర్చు భారము నీదే.

నందు:— (విశ్వనాథునివంక సాకూతముగఁ జూచి) అట్లే.

విశ్వ:— (స్వగ) గురుఁడేమో వేఱుమార్గము దలఁచుచున్నాఁడు.

నందు:— ఇఁక మాకు సెలవా ?

నట:— క్షేమముగఁ బోయి రండు. నాయనా, ఒకమాఱు నీముఖపద్మమును జూడనిమ్ము.

(చూచి కౌఁగిలించి శిరము మూర్కొని యేడ్చును.)

[నందాదులు నిష్క్రమింతురు.]

నట:— ఇంత వెన్నెల క్షణమునఁ జీఁకటి యయిపోయినది. నందన్న యిప్పటికి యథార్థరూపమున దొరకియు క్షణమున నష్టుఁడు కావలెనా ? మఱచితిని. నందా, నందన్నా, నందన్నా.

[నందుఁడు ప్రవేశించును]

నట:— నందన్నా, నాయనా, మరల నిన్నుఁ జూడఁ గల్గుట యెన్నఁటికి?

నందు:— చిదంబరము పోయినవారికి మరలి రాకయుఁ గల్గునా? అయినను మనము చిరకాలమునకేని కలసికొందుము లెండు.

నట:— ఉండుము. స్వస్తి పఠించెదను (“శంనోమిత్ర” ఇత్యాది పఠించును.)

[నందుఁడు నిష్క్రమించును.]

పుడమి జనించి పూజ్యమగు
భూసురవంశమునందు శాస్త్రముల్
కడగని పెద్దనై యఘము
కాక మఱేదియుఁ బ్రోది సేయలే;
డిడ నివసించు మాల జగ
దీశుని సుస్థిరభక్తిఁ గొల్చి వే
తొడరి చరించె మోక్షపుర
దుర్గమరథ్య; నిదేమి చిత్రమో! 41
(నిష్క్ర-౯.)



శ్రీ

# నందనారుచరితము

## సప్తమాంకము

### స్థలకము 1. — చిదంబరమార్గము.

[విశ్వనాథుఁడు, నందుఁడు, ఇరులను, కుట్టను ప్రవేశింతురు.]

విశ్వ:— స్వామీ, చూచితిరా? ఆదూరమునఁ గనవచ్చుచున్నదే, అదియే నటరాజదేవకులగోపురము.

నందు:— స్వామీ, చిదంబరాధినాథా,

చరణ మ్మౌనని గోపురమ్ము, జగదీశా, నీకు దివ్యాలయ
మ్మరయఁగ దేహ మటంచు, గర్భగృహ మాస్యం బంచు శాస్త్రమ్ము; గో
పురకుంభంబులు పోలవే నఖములం? బుణ్యమ్మునం జేసి దే
వర కాంచఁ వలనయ్యె వాని నయినన్ భక్తాళి కిన్నాళ్లకున్.

ఇన్నిదినములకు నీచరణాగ్రమును వీక్షింపఁగల్గితిని. ఇఁక నిన్ను వీక్షించు టెన్నఁడో?

కనక కనక నిన్నుఁ గాంతులఁగనిఁ గాంచ
కన్ను లోర్వ వేమొ కాంతుల కని,
చరణనఖము తేజు సౌమ్య మగుటఁజేసి
దాన నార్తు నన్నుఁ దనుపు దేమొ.

విశ్వ:—ఇదె కావేరిని జేరితిమి.

నందు:—తల్లీ, కావేరీ, ఏదోసమును బాపుకొననమ్మా నీసలిలముల శివ చరణప్రక్షాళనం బొనర్చుచున్నావు? అమ్మా, నీకును అఘమా?

జన్మదోష మెట్టిజనుఁడు నీసలిలానఁ
దలఁగు నంట, పొందఁ దరమె నిన్ను
దోష ? మేల ? మునులు దూరీకృతాఘులై
వదల రైరి తటనివాస మంబ. 44

అమ్మా, సహ్యజాదేవీ, ఆనాఁడు కంసభీతిచేఁ గృష్ణరక్షణార్థము గోకులమున కేఁగుచున్న వసుదేవునికి యమున తానై ఇరు పాయలై సాహాయ్య మొసంగెనఁట. నేనును భవభీతిచే నటరాజ దర్శనార్థము చిదంబరమున కేఁగుచున్నాను. దీనుఁడను. కరు ణించి నాకు దారి నీరాదా? ఏమి! అనుగ్రహసూచనయే లేదు కదా, మఱి ఉన్నటు లుండి నదియందు వఱద వచ్చుచున్నది! (నిరాశతో) ఈ ప్రవాహమునఁ బడవయైన నాడదు. అమ్మా, నీకుఁ బుట్టింటివాఁడను కానా నేను? నన్నుఁ గనికరింపవా అమ్మా! ఏమియుం జేయ దీమె. కఠినశిలాజాత: కారణగుణములు కార్య మున సంక్రమింపకుండునా? మహాదేవా, మందాకినీదర్పదళనం బొనర్చిన నీవె ఇఁక దిక్కు.

విశ్వ:— స్వామీ, అదె యొకపడవ దూరమునఁ గానవచ్చుచున్నది.

ఇరు— ఏ పక్కకి బోతుండాదో?

కట్ట— ఈడకే వస్తున్నాది. ఏం గుండెదిట వబ్బా! ఈ వరదలో పడ వేశాడు.

విశ్వ— ఇదిగో వచ్చినది. (పరిక్రమింతురు.)

[పడవవాఁడు ప్రవేశించును.]

విశ్వ:— అబ్బీ, మే మందఱము ఆవంకకు దాఁటిపోఁ గోరుచున్నాము. దాఁటింతువా?

పడ:— [స్వగ] అయ్యోర్లు! [ప్రకా] ఈ ఒరదలో పోవడానికి దైర్య ముండదా సామీ.

విశ్వ:— ఈభక్తుఁడు మాయొద్ద నుండఁగా భయ మేమి? మా కీయనయే తారకుఁడు.

పడ:— సిద్దుడా? (చూచి) ఎవరబ్బా! ఇంత గా యెలిగిపోతుండాడు; ఎవరు సామీ యీయన?

విశ్వ:— ఈయన మాయూర నొకమాల.

పడ:— అయ్యోర్లు మాలోళ్లతో యెట్టా కూడాఉన్నారయ్యా? మీరు శెడిపోలే?

విశ్వ:— ఈయన యనుగ్రహము చాలదా యెట్టివా రైనను పవిత్రు లౌటకు.

పడ:— మీ రేం జెప్పినాకాని సామీ ని న్నోమారు, ఆయ న్నోమారు దాటేత్తాను.

విశ్వ:— అన్ని ప్రాణులయం దాత్మ యొక్కటియే కదా? మనుజుని కి మనుజుని కింత భేద మెంచఁగూడునా?

పడ:— తెలనోళ్లకి మా కీ యేదాంతము యెందుకు సామీ? నామాట శెప్పాను. మాలోళ్లని అయ్యోర్లని కలిపే పాపం నాకొద్దు. ఎంత శెడిపోయినా మీరు బ్యామ్మలే.

నంద:— అట్లే కానిమ్ము.

పడ:— ఆళ్లు గూడ మాలోళ్లే!

విశ్వ:— అవును. స్వామీ, నిన్ను వీడి నే నెట్లు పోవుదును?

నందు :—ప్రాప్తము ననుభవింపవలెను గదా !

విశ్వ :—(పడవవానితో) మఱి రారా కే వెంత ?

పడ :—అయ్యోర్లను కే వడగతానా ? మీరూ మంచోడంటున్నారు, నాబుద్ధి కట్టనే తోస్తావుంది, కాబట్టి ఆయన్నిగూడ కేవడగను. రాండి. (విశ్వ. పడవ. నిష్క్రమింతురు.)

నందు :—అదిగో క్షణమున పడవ ఆవలిగట్టు చేరినది. మరలి మనవైపు నకు వచ్చుచున్నది.

పడ :—(ప్రవేశించి) మీరంతా రాండి.

(అందఱు పడవ నెక్కుట నభినయింతురు)

స్థలకము 2:—చిదంబర దేవాలయగోపురపురోభాగము.

[నందాదులు ప్రవేశింతురు. చుట్టును జనులు మూఁగియుందురు].

నందు :—

ఇదియే యంబరలింగనామకము
మాహేశాద్యవాసమ్ము; ని
య్యది కైలాసనగాతిశాయిమహిమ
మ్మార్తౌఘసేవ్యమ్ము; నా
టఁదమిన్ బార్వతి నిత్యమున్ ధవుని
నాట్యానన్ వినోదించు తా
వదె చిత్కాంతిఁ జిదాఖ్యక మ్మలఘు
సభ్యావాప్తిఁ బొల్పారెడిన్. 45

శంకరా, శివంకరా,

అదనూన్ వాసిని, మాలఁ, దెచ్చితి, వహో
యర్ఘమ్ము లందిత్తువో;

చదువుల్ నేరనివాని రమ్మనితి, వే
శాస్త్రమ్ము బోధింతువో?
పదివేలార్తులలోన నొక్కరుఁడ, నీ
భారమ్ము, వేతేమి నా,
కదనయ్యె; నను బ్రోవ రాఁగదవె నీ
హారాద్రిజావల్లభా. 46

ఒకఁడు:—(ప్రవేశించి) ఎవరురా ఈయన? చూచుటకు మాలవలె నున్నాఁడు. నోట సంస్కృతవాక్కు వచ్చుచున్నది.

ఇంకొకఁడు:—(ప్రవేశించి) ఎవరయ్యా, ఎంత కర్ణామృతముగా పాడుచున్నాఁడు!

మఱియొకఁడు:—(వెనుదిరిగి చూచి) నీ వఁటోయి శివరామదీక్షితుఁడూ; ఈ కాలములో మాలజోగులుకూడ కననగుచున్నారే!

శివ:—సుబ్రహ్మణ్యా! ఆయన యెవఁడు? బ్రాహ్మణుఁడు! మాలవాని వెంటఁ దిరుగుచున్నాఁడే!

సుబ్ర:—విను. అతఁ డాదనూరిమాలయఁట. మహాభక్తుఁడఁట. ఈయన విశ్వనాథ పండితరాజు. మొన్న కంచిలో డిండిమవాచస్పతి నోడఁగొట్టినాఁడని వింటిమే—

శివ:—ఆయనయా?

సుబ్ర:—ఆయనయే! ఈమాలవానికి శిష్యుఁ డఁట.

శివ:—ఇదేమి సుబ్బన్నా, ఇంత చదివినవాని కీపాటు?

నందు:—ఓహో జనులారా,

రారె నటరాజుఁ జూడరే, రాజమౌళిఁ
గానరే, చిదాఖ్య వెలయు కనకసభను

దీరి కొలువున్నవిధమున దేవదేవు
శోభఁ జూడ వేగమ రారె సుహృదులార. 47.

ప్రదక్షిణముచేసి వత్తము రండు. (నందాదులు జనము నిష్క్ర మింతురు.)

సుబ్ర:—ఏడిచినాఁడు, తనగతి తాను జూచుకోక.

శివ:—కాదు సుబ్బన్నా, మాహాత్మ్య మున్నటులే యున్నది. చూడు, ముఖమున దివ్యతేజస్సు కనఁబడలేదా ?

సుబ్ర:—నీకంటిలోనికిఁ జొచ్చికొనిపోయినదా, ఆ వెలుఁగు ?

శివ:—నీ కొంటెమాటలు మానవుగదా! వారుగో, అప్పయ్యదీక్షితులవారు వచ్చుచున్నారు. వారి కీసమాచారము నివేదింతము.

[అప్పయ్య దీక్షితుఁడు ప్రవేశించును.]

ఇరువురు:—స్వామీ, నమస్కారము.

అప్ప:—చిరంజీవ. సుబ్రహ్మణ్యా, ఎవఁడు నాయనా, మాలవాఁడఁట, ఊరిలో శివభజనఁ జేయుచుఁ దిరుగుచున్నాఁడఁట, కోవెల గోపురము చెంతనే ఇంతసేపు ఉన్నాఁడఁట. మాలవాని నూరిలోఁ దిరుగనిచ్చినా రేమి?

సుబ్ర:—ఆదనూరువాఁడఁట. ఆయనతో శిష్యుఁడుగ చరించుచున్నాఁడు విశ్వనాథపండితరాజు. అందువలన ఎవరును ఏమనుటకును సాహసింపలేదు.

అప్ప:—ఎవరు ! కంచిలో డిండిమ...

సుబ్ర:—ఆయనయే.

అప్ప:—అంతచదివినవానికి ఇదేమి?

శివ:—మాలవాఁడైనను మహానుభావుని లాగున్నాఁడు.

అప్ప:—ఏడిచినావులే. మహానుభావుఁడయినమాత్రము ఎవరివ చారము వారు కాపాడుకొనవలదా? కోవెలకు సం చేయవలసియుండునేమో ! సుబ్రహ్మణ్యా, నీలకంఠ యొద్దకు పోయి కనుంగొనుము.

[మురుగప్పమొదలి ప్రవేశించును.]

ఏమోయి, మురుగప్పమొదలి, మాలవారిని కో రానిచ్చినావఁట !

మురు:—ఏమి చేయుదును స్వామీ, వారు దేవతలవలె ను లోకమువారుగా నుండలేదు. ఆయనను జూచి ఆయ పాటలు విన్న నాకును ఆయనతోఁ జేరి భజన సేయ యనిపించుచున్నది.

అప్ప:—చాల బాగుగ నున్నది ! దేవాలయమునకు మైల సోఁ

మురు:—అట్టివారు కోవెలదగ్గఱకుఁ గాదు, లోపలికి వచ్చి సోఁకదేమో !

[తెరలో నందాదుల భజన.]

వారుగో స్వామీ, వచ్చుచున్నారు.

[నందాదులు ప్రవేశింతురు.]

నందు:—

క్షణము తోఁచి, యంత క్షణమున మఱుఁగౌట
పోసఁగ దింక ; నీదు పూర్ణిమఁ దెలుపు,
మొనయి లేని శోభ నెదురుగా వత్తువో,
దీను ల్లోనఁ గొంవో దీనరక్ష.

అట్లు సేయవైతివేని,

ఆర్తరక్షకుఁ డని యాడు రేల జనులు?
పుడమి నృపుల నీతి - ప్రోప దెప్డు
శ్రీయుతులకె, ద్రోఁపు సిరిలేనివారికె
యనుట నిక్క మౌనొ, యరయువాఁడ. 49

విశ్వ:— స్వామీ, వెలుపలనే యుండనేల? లోనికిఁ బోవుదము రండు.

అప్ప:—[స్వగ] శ్రుతి మించి రాగమునఁ బడుచున్నదే. (ప్రకా) అయ్యా, కొంచెము నిలువుఁడు. నే నీ యాలయమునకు ధర్మకర్తలైన దీక్షితులకు సభాపతిని. నన్ను అప్పయ్య యందురు. వా రెవరు?

విశ్వ:—అయ్యా, వారు నందనారు. మహాభక్తులు. కారణజన్ములు.

అప్ప:—వారు మాలవారని విన్నాను. నిజమేనా?

విశ్వ:—నిజమే.

అప్ప:— ఇదేమి, తా మిట్లు మాలవారిని కోవెలలోనికి రమ్మనుచున్నారే!

విశ్వ:— అయ్యా, భక్తులు భగవానుని సేవింపఁబూనుటయందు దోష మేమున్నది?

అప్ప:—తా మట్లు సెలవీయఁదగునా? మాలవారి నూరిలోనికే రానీయఁ గూడదు. మఱి తమ రున్నారని ఎవరును బదులు పలుకలేదు. ఇంతచిన్నవయసున నిన్నిశాస్త్రములు చదివి పండితరాజబిరుదమును దాల్చిన తా మీ శాస్త్రవిరుద్ధకార్యము సేయనగునా?

విశ్వ:— అయ్యా, శాస్త్రములు సామాన్యులకుఁ గాని ఇట్టి లోకాతీతులకుఁ గాదు. వీరికి వానితోఁ బని యేమి?

అప్ప:— వీరు లోకాతీతు లనఁ బ్రమాణము?

విశ్వ:— వారి మహిమ లనేకములు ప్రత్యక్షములు.

పంగూరఁ గోనేటిపని దీర్చె నొక్క
యహమునఁ గొలఁదులౌ నాప్తులతోడఁ
గోవెలనందియే గునగునఁ దొలఁగెఁ
బరమాత్మ దృష్టిపోబడి కడ్డులేక,
స్పర్శమాత్రముచేతఁ బరమపాపులకు
శుభమార్గగాములశోభను గూర్చె,
ఎకరంబు లిన్నూట నిరవొందు పైరు
నలువురితో నొక్కనాఁటన గోసె. 50

అప్ప:— తమరు చూచినవి మాకెట్లు ప్రమాణము స్వామీ?

విశ్వ:— నా మాటయందు తమకు నమ్మకము గలుగదా? ఇంతకుముందు నన్నెంతయో పొగడితిరే. గురువిషయమున నబద్ధ మాడుదునా?

అప్ప:— చండాలుఁడా తముబోంట్లకు గురువు?

విశ్వ:—

బ్రహ్మైవాహ, మిదం జగచ్చ సకలం చిన్మాత్ర విస్తారితం,
సర్వం చేద మవిద్యయా త్రిగుణయా సేశం మయా కల్పితమ్,
ఇత్థం యస్య దృఢా మతిః సుఖతరే నిత్యే పరే నిర్మలే
చండాలోస్తు, స తు ద్విజోస్తు, గురు రిత్యేషా మనీషా మమ.

అప్ప:— ఎట్టిపండితులైనను సర్వజ్ఞుఁడు సాక్షాత్తు శంకరావతారమగు శంకరునితోఁ దమకు సామ్యమా? ఆ వాక్కును తమరు నుడివినను సహించుట కష్టము.

విశ్వ:— నాకు సామ్యమని కాదు. నేను పరమాణువను. అయినను,
కిం గంగాంబుని బింబి తేంబరమణౌ చండాలవాపీపయః

పూరే వాంతర మస్తి? కాంచనఘటీ మృత్కుంభయో ర్వాంబరే?
ప్రత్యగ్వస్తుని నిస్తరంగసహజానందావబోధాంబుధౌ
విప్రోయం, శ్వపచోయ, మిత్యపి మహాన్ కోయం విభేదభ్రమః?
అని శంకరుఁడే అన్నాఁడుగదా!

అప్ప:— అయ్యా, శాస్త్రవాదమున కిది సమయము గాదు, సభయును గాదు. తమరు యుక్తివాదమున నొకవేళ మముబోంట్లను జయించినను అంతమాత్రమున నాగమశిష్టాచారమును, అనుగతసంప్రదాయమును మే ముల్లంఘింపము. తమరు దయచేసి యన్యాయపుఁ బలుకులు మా చెవిని వేయకుఁడు. దుష్కృత్యములకుఁ జొరకుఁడు.

విశ్వ:— అయ్యా,

నుముఁ గృపఁ జూడుఁడీ యన,
నమానుష శాస్త్రము నడ్డుఁజొన్పి, యా
విమలపుధర్మముం దెలియ
వెందుల మార్గమునైన నాడనీ
క, మిగుల దుష్కృతాచరణ
కాములు మీర లటంచు నింద సే
యు మనుజు నెట్లు దెల్పనగునో
సుధి, చెప్పుమ నిన్ను వేఁడెదన్. 51

నందు:— నన్నుఁగూర్చి ఇంతశ్రమ యేల?

కలుగు కార్యమ్మె యైన నీ కలఁత లేల?
కలుగ దేనియు వ్యర్థమ్మె కావె యెట్టు
లీ కృథాజల్పనమ్ములు; నిందుమాళి
భారవాహుని జేయ శుభమ్మె గలుగు. 52

సంకల్పించుచో నాతండ్రి నటరాజే నన్ను తనయంకమునఁ జేర్చికొనఁడా ?

[తెరలో "హర హర మహాదేవ, శంభో, ప్రసీద ప్రసీద" యని ధ్వని.
నీలకంఠ దీక్షితుఁడు శీఘ్రగమనమునఁ బ్రవేశించును.]

నీల:— స్వామీ, అప్పయ్యదీక్షితులవారూ. రాతినంది యూఁగులాడు చున్నది, ఏమి చేయవలయునో ! ఇదేమి విలయకాలమో !

నందు:— స్వామీ, స్వామీ, రాతినందియా ?

పుడమి నర్తింపఁ దోఁపఁడే పునుకతాల్పు,
ధవుని ననుసరించియ వచ్చె ధరణిధరుని
తనయ ; వారివెన్కను రాక ధర్మముగద
నంది ; కాయుత్తముఁడు రాతినంది యెట్లు ? 53

అప్ప:— [స్వగ] ఏమి, నిజముగ నితఁడు మహాభక్తుఁడేనా ? శివప్రసాదము వీనికిఁ గలదా ?

నీల:— ఏమి, ఊరకున్నారు ? ఏదైన నొకటి చేయవలెను. సెలవిండు.

అప్ప:— ఇది విపరీతమే ! నే నచటికి వచ్చినచో ఈ మహానుభావులకు బదులు చెప్పువా రెవరు ? అయ్యా, విశ్వనాథులవారూ, తమ చేఁతకు స్వామి కాగ్రహము వచ్చినది. నంది యూఁగుచున్నది. చూచితిరా. ఇఁకనైన మీ పాపవ్యవసాయమును మానుఁడు.

విశ్వ:— ఏమి ఈ యర్థనిష్పత్తి ! శివానుగ్రహజనితాద్భుతమును శివాగ్రహజనిత మని సమర్థింతు రేల ?

అప్ప:— అయ్యా, తాము పండితులు గదాయని యింతవఱకు ఊరకుంటిని. ఇఁక సహింపను. కడపటిపర్యాయ మడుగుచున్నాను. ఈ మాలవానిని దూరము కొనిపోయెదరా లేదా ?

విశ్వ:—

మాలయ డైన నేమి? యనుమానము
లేదు; శుభుండు; బ్రహ్మసూ
త్రాలు పఠించునర్థము ముదమ్మున
మూర్తి ధరించె నిట్టు, లా
బాల సుధాంశు శేఖరుని బంధుర
తేజము గాని వేఱె? పా
పాల దహించువారయిన భక్తి
భజింపుఁడు వీనిపాదముల్. 54

అప్ప:— ఇఁక నోర్వను. మురుగప్పమొదలి, ఆ మాలవానిని వానిబృంద మును దూరముగఁ దోలుము. ఈయన వారితోనే పోవును లే.

నంద:—

ఆదనూరునుండి యద నని రప్పించి
విభుఁడు నన్ను నేల వీడు నయ్య?
ఇంతవఱకుఁ దెచ్చి యేమని త్రోయును,
దాసుఁ బ్రోవ కిపుడు తలఁగు నెట్లు? 55

విశ్వ:— మహానుభావా, రప్పించినవాఁడు లోనికిని దీసికొనిపోవు నను టకు సందియములేదు. కాని మాయగ్రవర్ణమువారి కింతయహం కారము తగునా యని యాలోచించుచున్నాను. వీరిచేఁతకుఁ గోపమును గల్గుచున్నది.

నంద:— కోప మేల? నిర్బంధ మేల? క్షమచేతనే వారిహృదయములు కరఁగుఁగాక. మే మర్హులమైన వారను మేము కోవెలలోనికి వచ్చుట కనుమతింపరా?

శివరూపులైన వీరలె
యవమానము సేయఁగోరి, యందురె మనలన్ ?
భవుఁడే మాపాపమ్ముల
కవధిన్ విధియించునపుడె యందుం బోమే ? 56

విశ్వ:— శివతుల్యులకు తమ క్షీక్షమ వింతగాదు. కాని మానుషభావమున నున్న మా కీయోర్పు గల్గునా ? వీరికి

క్రాఁచుట యొక్కటే తెలియు
కార్యము ; వేదము నేర్పు వ్యర్థమా,
సైఁచుట మేలె, భూసురుల
శర్మపుఁ గర్మము లేని వీరలన్ ?
ఈ చన విట్టు లంచు విధు
లేర్పఱుపన్ బరిపత్తు లేమిఁ గా
దే, చిరవాసనాకలన
ద్వేషవిమూఢులు గారె వీరలున్. 57

అప్ప:— తనుపై మా కించుకయు ద్వేషము లేదు. ద్వేషముచేతఁ గాదు, మిమ్ము లోపలికి రావల దనుట. మీజోలికి మేము రాఁదలంప లేదు. మాజోలికి వచ్చి మా యాచారముల ధ్వంస మొనర్పఁజూచుట మీకుఁ దగదు. మాపై మీకు దురాగ్రహము వలదు. మీరు గొప్పవారైనను మీకొఱకు మా సనాతన సంప్రదాయాచారములఁ బోఁగొట్టుకొందుమా ?

నీల:— అంత యనుగ్రహము స్వామికి మీపై నున్న, ఆయనయే మిమ్ము లోనికిఁ దీసికొనిపోవును లెండు. ఆయననే శరణు వేఁడి ధన్యులు గండు.

విశ్వ:— స్వామీ. మంచి యాలోచనయే! అట్లే యొనర్తును.

దేవా నటరాజా, తల్లీ, శివకామేశ్వరీ మీరు స్వయముగ నాగు రుఁడు లోనికివచ్చుట కనుమతించుదాఁక మీచరణాంతికమున నిరాహారినై తప మొనర్చుచుందును.

గురుఁడు లోని కేఁగి కొమ రొప్పఁగా మిమ్ముఁ
గొల్చు టొండె; నాకు గురునికొఱకు
మృతియ యొండె; కాన మీనమేషమ్ముల
నెంచఁబోకు మింక నిందుమౌళి. 58

వేగము రమ్ము, విశ్వమును
భేదవుభావము లేర్చు నిట్టు; లీ
యాగడమున్ దమించి ధర
నారసి ప్రోచెడువార లెవ్వరే?
ఆగమపంక్తియర్థము
లయమ్మును బొందెడి బోధ లేమి. నా
వేగము నొంది మానసము
ప్రీలెడిఁ; దేర్పఁగ రావె, ప్రోవవే. 59

తండ్రి మమ్ముఁ బ్రోవఁ దమకించునో లేదొ
కరుణఁ, గన్నతల్లి, కలవిధమ్ము
తెలియఁజెప్పి జనుల దీనులఁ బ్రోవుము
జననికరుణ లేక జనము మనునె. 60

...దు:— ఈ నిర్బంధ మేల? నిర్బంధమునఁ బ్రేమ జనించునా? ఒక వేళ మీ ప్రాణమునకు భయపడి మ మ్మాలయములోనికి రానిచ్చి నను ప్రేమలేక శుభపర్యవసానము గల్గునా?

ప్రేమపరా, యథార్థము లె
ప్రీతిని నేర్వక బల్మి నేర్తురే ?
నీమము మేలొ, కీడొ,
వరణీయమ స్వైరపథమ్మొకం బె. ను
ద్దామవిధమ్మునన్ మన
మదాటున నూడ్వఁగనౌనె బంధన?
మ్మే మొనరించునో తలఁచితే
జన మొక్కట మేరమీఱెనన్. 61

విశ్వ:— స్వామీ, నన్ను క్షమింపుఁడు. ప్రతిజ్ఞఁ బూనితిని. తమకు శివప్రసాదమొండె, నాకు మృతియొండె, కలుగుఁగాక. కావేరినీట స్నానమాడి వచ్చి ప్రాయోపవిష్టుఁడ నయ్యెదను. సెలవు.

[ నిష్క్రమించును ].

నంద:— స్వామి యే యుపహారమును గోరుచున్నాఁడో యెవ రెఱుంగుదురు ? నాకో

ఘనమౌ జ్యోతులవెల్గువెల్లువల
నాఁక ల్వాయు ? దీప్రమ్ముగాఁ,
గనులన్ గట్టెడి నాథుమూర్తి శివ
యంకాసీనమై యుండఁగా,
మనమున్ బోయెడి ప్రేమవిస్మృతిని ;
నేమార్గమ్ము లోఁ జూతునో,
వనటల్ మే లెటులౌను ; తెల్పు
టెసఁగున్ వాదమ్ము భావోన్నతిన్. 62

[ నిష్క్రమించును ].

ఆప్ప:— నీలకంఠా, యేమిరా, ఈ యుప్పెన?

నీల:— లోన నందిసలనమును నిలిచినది. స్వామికే మాలవానిరాక యిష్టము కాదు.

అప్ప:— ఈ బ్రాహ్మణుఁడు తిండిలేక చచ్చెదననుచున్నాఁడే! ఏమిచేయవలయును?

నీల:— భ్రష్టుఁడైనప్ప డెవఁడైన నేమి? పండితుఁడైన నేమి, ఈశ్రద్ధనితరకార్యములందుఁ జూపరాదా? దుష్టకార్యమందున్న తత్పరత మంచికార్యమున నుండదు కాఁబోలు.

అప్ప:— తండ్రీ, నటరాజస్వామీ, ఈ బ్రహ్మహత్యాపాతకము మామెడ కంటఁగట్టక నీవే యేదైన మార్గముఁ జూపుము. 'త్వమేవ శరణం మమ' నీలకంఠా, స్వామిదర్శనము చేసికొందము, రమ్ము. మఱచితిని. మాల లింతవఱకు వచ్చినందులకు సంప్రోక్షణ జరుగవలెను గదా?

నీల:— కదా మఱి? జరుగకపోయిన నెట్లు? రండు, ఆకార్యమును నిర్వర్తింతము.

[ అందఱు నిష్క్రమింతురు. ]

---

శ్రీ

# నందనారుచరితము

## ప్రవేశకము

స్థలము : కావేరితీరము

[చిన్నమ్మ, కుప్పన్న ప్రవేశింతురు.]

చిన్న:— ఎందు కొచ్చిందన్నా, యిది? మన మెందుకే బాపనోళ్లం గావటం?

కుప్ప:— మనకేం దెలుసు శిన్నీ? మొదల నందన్న ఈవూ రొత్తానన్నప్పుడు మనమంతా ఒద్దన్నవోళ్లమే గదా! మొదట ఇదంతా వోడిపిచ్చి అనేకదా వుండింది! శిన్నయ్యోరు శెప్పినప్పుడే గదా, మన కీడు సాలా గొప్పోడని తెల్చింది. మనవోడు గొప్పైతే మనఁవంతా గొప్పేకదే శిన్నీ?

చిన్న:— ఏం గొప్పో, మన కట్లన్నీ ఒదులుకోని, ఎవరిమాదిరై నావుంటే ఆళ్లంతా మనల్ని గొప్పోళ్లంటారు. ఆళ్లకి మనమీద దయా, దాచ్చిన్నెమా?

కుప్ప:— మనమంటే దూరంపోయే అయ్యోరులు మనోణ్ణి పూజశేయటం నీకిట్టంలే?

చిన్న:— ఇట్టమే అనుకో. అయితేమాత్రం బ్యామ్మ డెట్లవుతాడన్నా, మాఁవ?

కుప్ప:— దేవుడు శెప్పినాడంటే గుడి అయ్యోర్లకంతా నిన్న కలలో గనబడి, "నందన్న నావోడు; రానియ్యాలసిం" దని. అందు మీాద అల్లంతా సబచేసి నందన్న నిప్పగుండాంలో దూకి ఒత్తే అల్లే బామ్మడవుతాడని, అవుతల తమలో గలుపుకోఒచ్చునని అనుకున్నారంట.

చిన్న:— గుండంలో దూకితే మాసులు కాలిపోరంటే అన్నా.

కుప్ప:— యెఱ్ఱిపిల్లా, మనం సూట్టంలే గుండాంలో దూకి బయటికి రావటం. బత్తివుంటే సరి.

చిన్న:— మాఁవ బ్యామ్మడయినాక మనతోగూడ వుంటాడంటే ?

కుప్ప:— ఉండకేం! ఆడు బ్యామ్మడయితే మనంమాత్రం బాపనోళ్లం గావూఁ? అట్లా ఓసారి కాకపోయినా మాలల్లో అంతా గొప్ప గందా ?

చిన్న:— బామ్మడు గావడమేంటి! నాకేమో దిగులుగా వుందబ్బా. అన్నా, మాఁవని సూత్తామో లేదో ? ఇప్పుడు కళ్ల సూడనైనా సూత్తావున్నాను. అవతల యే మవుతుందో ?

కుప్ప:— నీ కియ్యంతా తెలియవు లే.

చిన్న:— నాకేం తెలియ బల్లేదే. అన్నోవు, నీవు పోయి ముందట మాఁవ బామ్మడయినాక మనతోగూడ వుండేటట్టు ఆబాపనోళ్లతో ఒప్పందం శేశికో రా. ఎందుకొచ్చిందిరా యీశ్వరా! కళ్ల సూసే బాగ్గానికే నీకళ్లు కాలిపోయినాయా యీాస్సరుడా!

కుప్ప:— ఛీ, ఛీ, అసుబం బలకొశ్కే. నందన్న అటువంటివోడా? అదీ సూడు. నందన్న, బ్యామ్మలు, శిన్నయ్యోరు అందరూ యేటికాడ తానం శేసుడాని కొత్తుండారు. మనం మనరేవులో తానం శేశి గుండాంకాడికే బోతాంరా. [నిష్క్రమింతురు.]

---

# నందనారు చరితము

## అష్టమాంకము

### స్థలకము 1:—నదీతీరము.

[స్నానము సేయుచు నందుఁడు, విశ్వనాథుఁడు ప్రవేశింతురు.]

నంద:—[స్వగ] స్వామీ, నీ దివ్యసుందరరూపమును జూచుట కగ్ని స్నానము వలయునా? ఈదేహమాలిన్యము ఇట్టి పరీక్షలచేఁ బోవునా? జను లెంత వెఱ్ఱివారు! కాని స్వామీ, నీవే వారికిఁ గలయం దాజ్ఞాపించితివఁట. నీ సంకల్పమునకు విరుద్ధముగ నే నేల పోవలయును?

నాకుఁ జెప్పలేదు, నాకేల యని పల్క
నిజమ పల్కువారు, నీతియుతులు,
"శంభుఁ డర్థిఁ జెప్పె శర్మమ్ము నీ" కని,
యాజ్ఞ నొసఁగఁ, జేయ ననుట యెట్లు? 63

నీ నేత్రాగ్నిచేఁ గాముని దహించినను మరల నీవే అతనికి జీవ మిచ్చితివఁట, కాని

సంఖ్యయే లేని యాశలతాప మార్పి,
తప మొనర్పనియట్టి తరుణుని నన్నుఁ
గడతేర్చు బుద్ధిచే ఘనభక్తి నిచ్చి
నీపాదపూజాన నియతుని జేసి

యంగారకణముల నభిషేక మొసఁగి
తీరుగాఁ దీర్చిన దీనుని మరల
భవసాగరమ్మునఁ బడఁ ద్రోయ కయ్య,
బాధల కంతు కన్పడఁ జేయ వయ్య. 64

ఈ దినమే నాకు ముక్తి లభించునటుల స్ఫురించుచున్నది. ఈ క్లేశము లూడిపోవుచున్నటులు దోఁచుచున్నది. ఈ శరీరము తనంతట తిరుగుచున్నటు లున్నదిగాని నాసంకల్పానుసారము ప్రవర్తించుచున్నటుల లేదు.

విశ్వ:— మహానుభావా, స్నానముచేయక ఏమి ఆలోచించుచున్నారు ?

నంద:— ఈ దినము నాకు మహాదేవుని ప్రత్యక్షదర్శనము. ఇఁక నీ యైహికకృత్యములఁ జొరనొల్లను. వత్సా, నీకు చరమోపదేశ మిచ్చెదను. శివుని జూచిన తర్వాత నేరీతి నుందునో !

కర్తవ్యార్థపరాయణుండు సుఖియౌఁ;
గామ్యంబు ధర్మ్యంబుగా
స్మర్తవ్యంపుఁబధాలఁ జొచ్చి, నియతా
శాపూర్తులన్ బొందుచున్
వర్తింపందగు నిష్ఠతోడఁ; దనుసం
బంధమ్ము లెల్లప్పుడున్
హర్తల్; విస్మృతిఁ బూన్చు; నీశు విడకే
యానందమున్ బొందుమా. 65

భగవదాజ్ఞచే భగవత్ప్రీత్యర్థముగాక యేకార్యమునైన స్వేచ్ఛమై స్వలాభార్థము చేయఁబూనుటచే నహంకారము గల్గినచో స్వామిరూపము నే మఱతుము.

"ఇహమున్ ద్రోచి పరంబు గొల్తుమఁట; యిం
కే" యంచు గర్వమ్ముఁ బూ
ను హతాశుల్ గనలేరు నాథు నదియున్
దోషప్రకారంబె కాన్.
'అహమన్' భావము ద్రోయుచోఁ సుఖము. 'నా'
యన్ దృష్టియే మూల మీ
యిహపర్యాప్తికిఁ; గాన నా 'యహమిక'
న్నీశున్ సమర్పింపుమా. 66

[తెరలో "హర హర మహదేవ. శివరామా, వారు సిద్ధముగ నున్నారేమో కనుంగొనుము."]

విశ్వ:— బ్రాహ్మణులు కాచుకొనియున్నారు. ఈ యుగమున వినను భూతమహాద్భుతమీనాఁడు జగజ్జనంబులగ్రోల నర్తితమూఁగాక.

నందు:— అద్భుత మేమి? తనయునికిఁ దండ్రిసన్నిధానము కల్గుట యద్భుతమా?

[బ్రాహ్మణులు వేదఘోషము సేయుచుఁ బ్రవేశింతురు.]

విశ్వ:— స్వామి సిద్ధముగ నున్నారు. బ్రాహ్మణోత్తములారా, రండు.
[అందఱు పరిక్రమింతురు.]

## స్థలకము 2 :— దేవాలయద్వారము.

విశ్వ:— ఇదె పరీక్షాస్థలమును జేరితిమి.

నందు:— స్వామీ, నీ కుమారుఁ డోడిన నీకే యపకీర్తి. బ్రాహ్మణోత్తములారా, నేను నటరాజదేవుని యాజ్ఞానిర్వహణార్థము సిద్ధముగ నున్నాను.

నీల:— స్వామి కలంకారము ముగియలేదు.

నందు:— ఓహో, అలంకరణమా ఈ నిత్యమంగళవిగ్రహునికి? ఉప
చారమాత్రమైనను సాధ్యమా? ఏల యీ ప్రయాస?

స్ఫటికనిర్మలునకు స్నానంబు లేలొకో?
యజ్ఞదూరున కేల యజ్ఞసూత్ర?
మజినాంబరునకుఁ జీనాంబర మ్మేలొకో?
గంగాప్రియున కేల కంజమధువు?
చిద్రూపభాసికి శ్రీగంధ మేలొకో?
ఇందుమౌళికి నేల యిన్నిపూలు?
తేజస్స్వరూపికి దీపమ్ము లేలొకో?
దురితహరున కేల ధూపచయము?

రమ్యజీవనతతియె నీరాజనమ్ము.
విమలజీవమె వేఱునై వేద్య మేల?
హైమవతి సాక్షి కొల్చిన యంగజారి
సొగసు సేయుట వెఱ్ఱికా సూరులార. . 67

అప్ప:— అలంకారమును అయినది.

నందు:— స్వామీ, అనుజ్ఞ నిత్తురా. జనములారా, సెలవు. తండ్రి
సన్నిధి కేఁగుచున్నాఁడను.

"జననీ మేదిని, తాత మారుత,
వయస్యా వహ్ని, చుట్టంబ జీ
వనమా, సోదర తారకాపథమ,
భవ్యప్రేమ సంధిల్ల మీ

కొనరింతుర్ జరమప్రణామము,
భవద్యోగస్ఫురత్పుణ్య సం
జనితజ్ఞాన నిరస్తమోహతతినై,
సద్బ్రహ్మముం బొందెదర్." (భర్తృహరి)

తంత్రీ నటరాజమూర్తీ,

నాలు నియతిఁ ద్రోచు కలమనోహరగీతి
కా లయానునృత్యకారిపాద
కంజరేఖ నాదుకలుషమ్ము లడఁచి నీ
యంకసీమఁ జేర్చి హరుస మొసఁగు. 68

[నిష్క్రమించును.]

అప్ప:— నీలకంఠా చూడుము, చూడుము. నందునిదేహము క్షణములో నలుపయినది. క్షణమున హిమస్వచ్ఛ మయినది. క్షణమున పాండురవర్ణయుక్త మైనది.

విశ్వ:— (ఆనందబాష్పములతో) తంత్రీ, నటరాజమూర్తీ,

అప్ప:— గుండమునుండి నందనారు వెలికి వచ్చుచున్నారు. పోయి తోడ్కొనివత్తము రండు. [పరిక్రమింతురు.]

స్థలకము౩ ;—కనకసభ

[బ్రాహ్మణులు నందుని తమమధ్యమున నిడికొని ప్రవేశింతురు.]

విశ్వ:— నందనారు స్వామీ, ఇదె సన్నిధికి వచ్చితిమి. అదె నటరాజమూర్తి.

నందు:—

చిరకాల సంతప్త జీవంబు చివురిల్ల
నామని యరుదెంచు నంక మిదిగో,

దీర్ఘనిదాఘార్తి దిటవును గోల్పోని
హృన్మయూరపు నాట్యరీతు లివిగో,
అశ్రుధారాక్షాళితాచ్ఛచిత్తాదర్శ
ఫలకబింబితనిజప్రభలు నివిగో,
వరశీతకరపరిష్వంగసుఖావాప్తి
నణఁగి మణఁగు ముగ్ధయంద మిదిగో,
చిరము నన్నలయించిన చెలువుఁ డిపుడు
తేరి నను జూచి మెఱుఁకొని దేహనిష్ఠ
దివ్యతేజముఁ గబళించు తీరు నిదిగో
నాథనిక్షిప్త జీవాత్మ నన్నుఁ గనుఁడు. 69

(నటరాజవిగ్రహముపై నొరగును.)

విశ్వ:— బ్రాహ్మణోత్తములారా, కుమారుఁడు తండ్రియంకమున నాసీనుఁడై యున్న యీక్షణమున జయనాదములఁ జేయుఁడు.

శివ:—

జయము జయము నీకుఁ జండాలకులమునఁ
బొడమి వహ్నిఁ దీరి పూజ్యుఁ డైతి.
జయము జయము నీకు శరవణభవు నట్లు
శివునియంకతలిని జేరి తనఘ. 70

సుబ్ర:—

అగ్రవర్ణదృష్టి నార్తి నొందెడి జాతి
నూరువెలిని ననఘ యుద్భవించి
పరమశివుని జేరు భాగ్యమ్ము నీవెగా
కెవరు పొందఁగలిగి రెందు నార్య. 71

అప్ప:—స్వామీ, ఇఁక నటరాజదేవుని బూజింతువు గాక.

నీ వాక్యమ్ములు విందు లీనుత
భవానీనాథు శ్రోత్రమ్ములన్,
తీవిం గూర్చుత నీదుమాళి
పదపీఠింబొల్చు నీ రేజమై,
పావిత్ర్యప్రతిపాదకమ్ము
నటరాట్పాదానుసంవాహమున్
నీవే సేయుమ, నీదుహస్తముల
నున్మేషించుఁ బూజాక్రియల్. 72

విశ్వ:— ఇదేమి ? గురుదేవుఁ డూరకున్నాఁడు ? (చెంతకుఁ బోయి) స్వామీ, పూజ నుపక్రమింపనున్నారు. (చేయి పట్టుకొని) నందనారుస్వామీ, (కదలింప యత్నించి) హా, గురుదేవా, మమ్ము వీడిపోయితివా. (నేల వ్రాలును.)

అప్ప:— ఏమి! ఏమి! (నందు శరీరమును దాఁకి తలయూఁచి) ఈ మహానుభావుఁడు ప్రాణపుష్పముల నిదివఱకే పూజ యొనర్చినాఁడు.

విశ్వ:— హా, గురుదేవా, నన్ని లోకమున వీడి జగత్పితృసన్నిధి కేఁగితివా ? అందులకే కాఁబోలు, మాటిమాటి కిదినము శివుని ప్రత్యక్షదర్శన మనుచుంటివి. అంధుఁడనై తెలియకపోయితిని. ఇందులకు నేనే కారణము. నే నాప్రతిజ్ఞఁ బూనకున్నచో, నీ వీకోవెలయందుఁ గాకున్నమానె, జగద్దేవాలయమున నిత్యావిర్భూతశివుని జూచుచు నుండువాఁడవు.

నాగురుఁడై హితకమ్ముల ననాకులుఁడై
త్యజియించు; దైవమా,

యోగును దూల్చి వేడబము లూడ్పదె
యంచుఁ, బ్రతిజ్ఞ వట్టి నే
నీగతి బేల నైతి; గురుఁ డేఁగెను,
నే నిట నొంటిఁ జిక్కితిన్.
ఓ గురుదేవ, నంద, కనవో
విలపించెడి యార్తవర్గముల్. 73

అప్ప:—స్వామీ, ఆశ్వసిల్లుఁడు. మహానుభావుఁడా నందస్వామి. చిర విరహము నోర్వఁజాలక నటరాజమూర్తియందు లీనమైనాఁడు.

కనులు నీటను మునుఁగంగ ఘనతరార్తిఁ
గాలగళుని మాయాధారఘనునిఁ జూడ
వగచి వలపునఁ గృశియింప, నగజపతియుఁ
గొసరి జీవితకుసుమమ్మొ కొనియెఁ ముదికి. 74

నీల:— (శివరామదీక్షితునితో) మాలలు బ్రాహ్మణులు కావలెనన్న యీ ధర్మవ్యతిక్రమమును దేవుఁ డోర్చునా?

శివ:— (జనాం.) మూర్ఖుఁడా, ఊరకుండుము. (స్వగ) ఏమో, జాతిచేతఁ గలుగు మాలిన్యము జాతిచేత వచ్చును గాన, జన్మాంతరమునఁ గాని ఉత్తమదేహము లభింపదేమో.

విశ్వ:— స్వామీ, నందదేవా,

. జననం బొందిన మాలవై పుడమి,
నాజన్మంబు శుద్ధుండవే;
యనలం బొందఁగ సయ్యె నీకు
నిఁక; లీయార్తుల్ విషాదమ్ములున్

మన సెట్లోర్చును? నీదురంతవిధి
నే మందుండునుంబోలె నై
తిని; నీయానతిఁ దీర్పఁగావలయు నీ
దీనుఁ గటాక్షింపుమా. 75

అప్ప:— నందనారుదేవా, నీచరిత్రము మహాభక్తికిఁ బ్రమాణమై జను
లకు శిరోధార్యమగును గాక.

ఈకథ భక్తలోకనిరతేష్ట
విధాయినియై రహించుచు
న్నాకవివాక్కులందును సుఖమ్మును
గూర్చు సుధాస్రవంతియై.
లోకము జాతి నెంచ
కతిలోకమహద్గుణపక్షపాతమై
ప్రాకటశాంతిసౌఖ్యరతి
భద్రగతిన్ భజియించుఁగావుతన్. 76

సమాప్తము.

---

మన్మథుఁడు దహింపఁబడఁగా పార్వతి తపముచేఁగాని శంకరుఁడు లభ్యుఁడు కాఁడని తప మొనర్చెను.

ప 1. 'ఆనందప్రథమావతారసధుర్యంబు' సచ్చిదానందముల నొకటియగు నానందమును మనస్సుచేఁ దెలియఁజాలము. అది మనోమయకోశమున కవతరింపఁగా 'రస' నామమును బొందును. ఈ రసమునే ఆర్యకవు లుపాసించి తమకావ్యముల నించిరి.

సిరిగలవారికి (నటరాజాదులకు) జనించు మోహాదులను విజ్ఞానాగ్నిచే నశింపఁజేసి పర్వతారణ్యవాసులైనను (నందాదులు) తనభక్తులైన వాత్సల్యమును నెఱపు శివుఁడు మోహనివృత్తిని ఆనందానుభవము నొసంగునుగాక యని యాశయము.

ప 2. 'శ్రీరమణర్షి' అరుణాచలవాసి. ఈయన కుమారావతారమని భక్తుల నమ్మకము.

ప్రథమాంకము.

ప 3. 'సంజకెంజాయ...' నాటకమున రజస్సడంగుటయు నంత నంబరమున (చిదంబరమున) తారాదివిద్యాధినాథ మగు శాంతిస్వరూపమును నాయకుఁ డొకఁడే పొందుటయు వర్ణితము. భరతవాక్యముననునిదియే చెప్పఁబడినది. 'ప్రాకటశాంతిసౌఖ్యరతి భద్రగతిన్ భజియించుఁగావుతన్.' ఈపద్యము నాటకపరమార్థమును సూచించుచున్నది.

ప 4. 'కావేరి' ఆదనూరునకు ఉత్తరమున చిదంబరమునకు దక్షిణమున కొల్లడము గలదు. అది కావేరిశాఖల నొకటి గావున నిచ్చోట కావేరియే చెప్పఁబడినది.

పు 4. 'అబాసే మా కద్దం గాలేదు......' నందుని పూర్వజన్మకథకు పీఠికం జూడుఁడు. తత్సంస్కారస్ఫురణము కలుగఁగాఁ దదనుగుణ

మగు భాషయు వచ్చినది. ఉత్తమపాత్రములకు ఉత్తమభాషయే ఇందుఁ బ్రయుక్తము.

పు 4. 'ఇదియేనా నీవరము.' ఈవరమువృత్తాంతము 6-వ పద్యమున నున్నది.

ప 6. 'కలియుక్తిమార్గముగా' కలిలో భక్తియే ముక్తిమార్గము.

"హరే ర్నామ హరే ర్నామ హరే ర్నామైవ కేవలమ్
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యథా"

చైతన్యుఁడు.

'శౌరిసహోదరి' అంబిక. నారాయణియనియు నామెకు నామము 'పద్మాసనా భగవతీ పద్మనాభసహోదరి' లలితాసహస్రనామము ౨ అధ్యా. 65 శ్లోకము. తద్భాష్యము. 'ప్రాదు ర్బభూవ త్రిపురా పద్మహస్తా సనాతనా, పద్మాసనేచ తిష్ఠన్తీ విష్ణునా జిష్ణునాసహ'

పు 7. 'నాపైనోడు...'నంగుని కనాగతజ్ఞానమును గలదు.

పు 9. 'ఈస్నేహతంతువును...' విశ్వనాథుఁడు ముముక్షువైనను సంసారమోహ మాతని వీడలే దనుటయు ధార్మికజీవనమున నతనిపట్టుదలయు తెల్లము.

'కా తే కాన్తా...' శంకరాచార్యకృతమోహముద్గరములోనిది. 'భజ గోవిందశ్లోకము' లని యిది ప్రసిద్ధము.

## ద్వితీయాంకము.

ప 9. అజ్ఞానమే మహాపాతకమా ? తమయంతరంగముల శాశ్వతముగ నున్న నిన్ను ఏమార్గమున యోగివరేణ్యులు ఎఱుఁగ నేర్చిరో ఆ మార్గమును కోరుటకైనను వీరు సమర్థులా? (మొదట జ్ఞానమునకై కోరిక,

తర్వాత తదన్వేషణము. కోరికయే పుట్టకున్న ?) వీరు తమోమగ్నులని త్రోసివైతువా ? కూడదు; వీరిని దయఁ జూడు మని తాత్పర్యము.

తృతీయాంకము :

పు 18. 'గౌడసంప్రదాయము...' భరతఖండబ్రాహ్మణులు పంచద్రావిడులనియు పంచగౌడులనియు రెండుతెగలు. తమిళాంధ్రకర్ణాటకేరళమహారాష్ట్ర) బ్రాహ్మణులు పంచద్రావిడులు, తదితరులు గౌడులు. గౌడులకు మత్స్యభోజనము దృష్టిదోషరాహిత్యము విశేషధర్మములు.

పు 20. 'చిదంబర మాహాత్మ్యము...' పీఠికం జూడుఁడు.

ప 11. శివదారుకావనతాండవవర్ణన. చూడుఁడు పీఠిక.

చతుర్థాంకము.

ప 13. 'మను...' సృష్టికిఁ బూర్వము నారాయణుఁ డొక్కఁడే కలఁడనియు నాస్థితి రుచింపక రెండవవిషయమును కోరి ఆయన సృష్టి యొనర్చెననియు శ్రుతి.

"స వై నైవ రేమే తస్మా దేకాకీ న రమతే, స ద్వితీయ మైచ్ఛత్, స హైతా వానాస యథా స్త్రీపుమాగ్ంసౌ సంపరిత్యక్తౌ"

బృహదారణ్యకము 3. చతుర్థబ్రాహ్మణము.

ఇట నందుఁడు ప్రార్థించు ద్వంద్వము సహచరునితోడి ద్వంద్వము.

ప 14. 'ఓహో! కుహనాకిరాతక' కిరాతార్జునీయకథ. అర్జునుని బరీక్షింప శివుఁడు కిరాతవేషధారియై అడవిపందిని దఱుముకొని వచ్చెను. ఏకకాలమున నర్జునకిరాతకు లిద్దరు దాని నేసిరి. దానికై యిరువురికి య్యుద్ధ మాయెను. అంత నర్జునుని బాహుశక్తిని మెచ్చి

ఈశ్వరుఁడు నిజరూపమును చూపి యతనికి పాశుపతాస్త్రము నొసంగెను. భారతమును జూడుఁడు.

'త్వగుజ్జ్వలతేజము దాఁచు తీరగా'. 'ఈశావాస్య మిదం సర్వమ్' అని యుపనిషత్తు. అనఁగా సర్వము నీచునిచే నావరింపఁబడి యున్న దని యొకమతము. శ్రీ అరవిందయోగు లీమతము నంగీకరించి యున్నారు.

ప 15. 'గుహాంతరమునన్' గుహ యనఁగా బుద్ధి.

అణో రణీయాన్ మహతో మహీయాన్

ఆత్మా గుహాయాం నిహి తోఽస్య జంతోః "శ్రుతి.

గుహాశబ్దేన హృదయపుండరీకమధ్యవర్తినీ బుద్ధి రుచ్యతే, అనిభాష్యము.

ప 16. 'మమత......' దక్షయజ్ఞధ్వంసకథ.

దక్షునికూఁతురు సతీదేవి శివునిభార్య. కారణాంతరమున శివుఁడన్న దక్షునికి ద్వేషము. అతఁ డొనర్చు యజ్ఞమున కాయన శివుని బిలువకున్నను సతి యచ్చోటికేఁగెను. దక్షుఁ డంత శివుని దూషించెను. పతినింద నోర్వఁజాలక ఆమె యోగాగ్నిచే నాత్మదేహమును దహించుకొనెను.

'ఉమ, ... గిరిరాజకన్య...' కుమారసంభవకథ చూ. ప 1.

ప 17. 'ముక్తిసుధార్ద్రగీతముల్' యోగాభ్యాసకులకు వివిధ నాదములు వినవచ్చును (ఘంటావీణారవాదులు). అవియే ఇం దుద్దేశింపఁబడినవి.

ప 18. 'ఏ నెఱుఁగన్......' నీమార్గమా నాకుఁ దెలియదు; అన్నివైపులను నాకు బంధములే కనఁబడుచున్నవి. వీనినుండి తప్పించుకొనుటకు సాధనమా, అన్నియెడలకు నన్నుఁ ద్రిప్పునట్టి చంచలమనస్సు.

ఇఁక నెట్లు బంధములు నాశ మగును? కావున సౌఖ్యమునకు దారి తెలియకున్నది. లేక హీనులను సేవించుటచేత ముక్తి ఏమార్గములఁ గల్గునో ఆతేజోమయమార్గములు (అర్చిరాదిగతులు) నా కలభ్యములా? యని భావము.

ప్రమహఃపథ ... — తేజోమయమార్గము (అర్చిరాదిగతులు.)

'తైజసములు వైరాజాభిధానకములు
నైన లోకంబులు ధ్రువంబు లగుత నీకు.'

అంకము ౨. ఉత్తరరామచరిత్ర (వేంకటరాయశాస్త్రులవారి యనువాదము.)

ప 20. 'ఈయఁ దలకొన్న......'

ఆనందరామాయణమున కథ ఇట్లున్నది.

ఒకప్పుడు రావణాసురుఁడు శక్తినిగూర్చి తప మొనర్ప శక్తి ప్రత్యక్షమై 'నీవు నా కొకలింగమును సమర్పింతువేని నేను ప్రసన్న నయ్యెదను' అని పలికెను. అంత నతఁడు లింగమునకై శివుని బ్రార్థించెను. ఆదేవుఁడు సంతుష్టుఁడై లింగము నేకాక పార్వతినిగూడ అతని కనుగ్రహించెను.

పు 31. "స్నేహితుల కందఱికిని......" శేపు శే పనుటచే నందునికి 'తిరునాళైప్పోవా'రను నామము వచ్చినది. పీఠికఁ జూడుఁడు.

పు 32. 'సర్వాంగము......' దర్శనస్పర్శనాదులచే శక్తిపాతము కల్గించి మహాత్ములు శిష్యుల ననుగ్రహింతురు. ఉదాహరణము. చైతన్యుఁడు అద్వైతానందుని గొట్టి రామకృష్ణుఁడు వివేకానందుఁ దాఁకి శక్తుజృంభణమునకుఁ గారకు లైరి. ఇందు విశేషము నటరాజభట్టరు (శిష్యప్రాయుఁడు) గురువును (నందుని) గొట్టి యనుగ్రహము పొందుట.

పు 33. 'నాకు... నాకు—ఇంతయనుగ్రహము......'

నాకు నీయనుగ్రహము ఇంత లభించుట నీపై నున్న స్వల్ప భక్తికే ఫలమా? ఇంతయనుగ్రహము ఏల ? అని నందుని భావము. భట్టరు వే తెలిపినాఁడు.

పంచమాంకము:

పు 39. 'జీవప్రాయశ్చిత్తము...' మరణోన్ముఖులైన వారలకు జీవితకాల మంతంతట నొనర్చిన సర్వపాతకములకు నిష్కృతిగా నొక ప్రాయశ్చిత్తకర్మ జరుపఁబడును. దానిని జీవప్రాయశ్చిత్త మని వ్యవహరింతురు. ఈప్రాయశ్చిత్తమును స్మరించుటచేతనే నటరాజభట్ట రనుభవించు నా వేదన తెల్ల మగుచున్నది.

పు 41. 'స్వరసము...'నందునిప్రసాదదృష్టిమహిమను బరికింపుఁడు.

పు 42. 'శుద్ధభక్తి'=సాత్త్వికభక్తి. దేవపూజాదివిషయము, తామసిక యక్షాదిగణవిషయము గాదు. చూ. భగవద్గీత. అధ్యా 17, శ్లో 2.

ప 24. 'ఘనమార్గము:—గొప్పమార్గము. రెండవయర్థము ఘన = మేఘముల, మార్గము = దారి, ఆకాశము లేక అంబరము. చిదంబరమున నున్నది యాకాశలింగము గదా.

షష్ఠాంకము:

ఈశ్వరశక్తి యావిర్భవించిన నందునివ్యాహృతి. దాని కితరులు భయ మందుట.

ప 32. 'దేవరాడ్గర్వవిఘాతుకః' శివుఁడు ఇంద్రుని గర్వ మణఁచిన సందర్భము లెన్నియో. వాయ్వగ్నులతో భాషించినను ఇంద్రునెడలఁ దిరస్కారమున శివుఁడు దిరోహితుఁ డాయెనని యుపనిషత్తు. జలంధరో

పాఖ్యానమునను పంచేంద్రోపాఖ్యానమునను శివుఁ డింద్రుని బరాభవించుట వర్ణితమై యున్నది.

ప 33. శంకలనుండి వెల్లగింపఁబడిన, అనఁగా శంకావిదూరమైన భావము కల మునిసమూహమునకు ధ్యానవిషయమును, సంసారపంకము నిండిన భూమియందు నివసించు జనులకు సుఖ మొసంగు తేజంపు ముత్తమును, ఓంకారస్వరూపమును, సంతోషించిన పార్వతివిపులస్తనములచే నుపలక్షితమును, నైన శివదేహము రాగసముద్రమున మునింగియున్న మమ్ము రక్షించుఁ గాక యని యర్థము.

ప 34. 'అనిలయోగము' = ప్రాణాయామము.

'వేయియరమ్ములచక్రమందు' = సహస్రారచక్రమందు.

ప్రాణాయామము సేయుచుండఁగా కుండలినీశక్తి ఉద్బుద్ధమై షట్చక్రములఁ జొచ్చును. కడపటి చక్రము సహస్రారము. అందుఁ జొచ్చుటకు ముందే మనస్సు రూపస్మృతిని గోల్పోవును. శక్తి సహస్రారమందు లీనము కాఁగా కేవలము కాంతియే తోఁచును. ఆ కాంతియే శివుఁడు, పరమాత్మ.

ఏ యోగగతివలన నాశివునితో సంయోగము గల్గునో ఆ యోగగతి నేను వేదవిహితాక్షరముల నతని నుతించుటచే నాకుఁ గల్గుఁ గాక యని నందుని ప్రార్థన.

ప 36. 'అంతేవాసి' = మాల.

పు 53. 'మనస్సైగదా...' 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' అని ప్రమాణము కలదు.

సప్తమాంకము:

పు 57. 'సహ్యజ' సహ్యపర్వతమునఁ బుట్టినది, కావేరి.

పు 57. 'మందాకినీదర్పదళనంబు' భగీరథుఁడు గంగను భూలోక మునకుఁ దే సంకల్పించి దానియురవడి నోర్వ శివుని బ్రార్థించెను. 'ఇతఁ డానన్నోర్చు' నని గంగ మహావేగమున నవతరించెను. హరుఁడు తన్మ దమణఁప నామెను తనజటామధ్యమున నొకవత్సరము దాల్చి గర్వభంగ ముచేసి భగీరథునిప్రార్థనచే వదలెను.

ప 45. 'అలఘుసభ్యావాప్తి' చిత్సభయందు సభ్యులు మూఁడు వేలు. ఎల్లరును సాక్షాచ్ఛివస్వరూపు లని నమ్మకము.

ప 50. 'కోవెలనంది' తిరుప్పంగూరుదేవాలయపునంది. చిదం బరపునంది గాదు.

'బ్రహ్మైవాహ...' ఈ శ్లోకమును దరువాతిశ్లోకమును మనీషా పంచకములోనివి. శంకరాచార్యుఁడు స్నానావంతరము గంగనుండి తిరిగివచ్చుచు నెదుట నొకమాలను గని తొలఁగు మనెను. అతఁ డెదు రొక్కని శ్రుత్యాదిప్రమాణములతో భేదదర్శనము శరీరవిషయమున నేని ఆత్మవిషయమున నేని కూడ దని వాదించెను. శంకరుఁ డతనివైదుష్య మునకు వెఱఁగుపడి మనీషాశ్లోకపంచకము రచించి మ్రొక్కెను. అంత మాల యంతర్ధానమై యచట శివుఁడు ప్రత్యక్ష మాయెను. ఆచార్యు ననుగ్రహించెను.

ప 53. చిదంబరమాహాత్మ్యమున - వ్యాఘ్రపాదుని కోరికచే చిదంబరమున నానందతాండవమును జూప శివుఁ డావిర్భవించె ననియు నతనితోఁ గైలాసవాసు లెల్లరు పుడమికి వచ్చిరనియు కలదు.

## అష్టమాంకము:

ప 65. 'విస్మృతిఁ బూన్చు' భగవంతుని లేక ఆత్మను మఱచు నట్లు చేయునని భావము.

ప 66. 'ఇహపర్యాప్తికిన్'=ఇహమే చాలునను బుద్ధికి. దీనికి మమ కారమే కారణము.

పు 78. 'నలు పయినది...' యోగోన్నతి ననుసరించి శరీరవర్ణము మాఱునని యొక ప్రథ కలగు.

## ఈ కవిచే రచితములైన యితరగ్రంథములు

---

1. యవన కావ్యమీమాంస

2. బిల్వమంగళము

3. లీలాశుకము

4. భగ్నప్రేమ

# శోధనపత్రము.

| పుట. | పఙ్క్తి. | ఉన్నరూపము. | స |
|---|---|---|---|
| vi | 5 | నను ? | నను |
| ,, | 6 | కలదె | కలదె ? |
| ix | 14 | త్రొండ | త్రొండ |
| 11 | 17 | నేమో. | నేమో, |
| 13 | 16 | గంధా | గందా |
| 15 | 8 | టకు, | టకు |
| 18 | 6 | నుప్పాగారము | నుప్పాంగా |
| 31 | 8 | చున్నాడే | చున్నా< |
| 43 | 23 | యొక్క | యొక్క |
| 48 | 16 | శంకోత్పాటిత | నంద: —— |
| 50 | 19 | వస్తున్నాండు. | వస్తున్నా |
| 61 | 3 | జనము | జనులు |
| 77 | 5 | యజ్ఞదూరున | పా. యజ్ఞ |
| 78 | 15 | పచ్చు | వచ్చు |
| 83 | 16 | ధానిని | దానిని |
| 84 | 3 | తారస | తారరస |
| 85 | 8 | రనధా | రన్యధా. |
| 87 | 8 | గుహా | గుహో |